# అశోకం

-ముద్దుకృష్ణ-

జ్వాల

• బెజవాడ •

# మి థి ల

## 1

[ ఉదయం. పెద్ద ఉద్యానవనం. అజ్ఞకుపెరిగినట్లు వింతవింత వృక్షాలూ లతలూ తీర్చినసోయగాన్ని తెలుపుతూఉన్నవి. రెండు చక్కని కాశ్మీరవృక్షాలమధ్య చలువరాతితిన్నెమీద సీత కూర్చుని వున్నది. ఒక చెలి చెంత నిలిచి మాట్లాడుతూవున్నది. ఇంకొక చెలి తొందరగా ప్రవేశించి ]

చెలి

అమ్మా, లంకేశ్వరులు రా నపేక్షిస్తున్నారు.

సీత

సరే రమ్మను.

[చెలి నిష్క్రమణ]

[ రావణుడు ప్రవేశం. ఇరవైఅయిదుసంవత్సరాలయౌవనంలో వలె ఉన్నాడు. ఆకారం, వదనం ఏదో గాంభీర్యాన్ని సూచిస్తూఉన్నవి. సీత లేచి ఆహ్వానిస్తుంది ]

సీత

ఆ ఆసనం.

రావణుడు

మంచిది.

[ చెలికత్తె కాశ్మీరవృక్షంనీడకు దూరంగా వెళ్లుతుంది ]

సీత

లంకనుంచి ఇంతదూరం ప్రయాణం మహాప్రయాస.

రావణుడు

కాదు. కార్యార్థికి ప్రయాస లేదు.

సీత

[ చిరునవ్వుతూ ]

సాహసులు, అందుచేత పాటింపులేదు.

రావణుడు

అదికాదు. ఉత్సాహమూ, ఆతురతా వేగాన్ని అధిగమించి దూరాన్ని తొందరగా దగ్గరకు లాగినవి.

సీత

ఎందుకూ అంత తొందర?

రావణుడు

జనకాజ్ఞ శిరసావహించడానికి; నా అదృష్టమును పరీక్షించుకోడానికి.

[ సీత కాశ్మీరవృక్షంవైపు చూస్తుంది ]

రావణుడు

మర్యాద ననుసరించి నీఅనుజ్ఞపొందడానికే కాదు, ముందు నాహృదయం విప్పిచెప్పడాని కని ముఖ్యంగా వచ్చాను.

సీత

ఏమిటి?

రావణుడు

సీతా, దాపరికంలేకుండా చెప్తాను. క్షమించు. ప్రేమదహించుతూవున్న నాహృదయానికి శాంతి ఏదేపవల్ల అని ప్రపంచమంతా శోధించాను. ఈ దుర దృష్టజీవికి ఎక్కడా లభించలేదు. నిరుటిసంవత్సరం

విమానంలో కాశ్మీరానికి వెళ్తూ మిథిలమీదుగా ప్రయాణం చేశాను, జనకులు పట్టణానికి నూతనాలంకరణలు ఏవో చేయించినారు అని విని. అదృష్టవశాత్తు నీవు సౌధోపరినుంచి పట్టణాన్ని చూస్తున్నావు; నేను పట్టణంశోభ చూడవలెనని దూరసూచితో చూస్తున్నాను విమానంనుంచి. నాభాగ్యంవల్ల నీవు కనిపించావు. నిన్ను కళ్లార అచ్చుపడేటట్టు చూసుకున్నాను. ఇంతలో నీవూ పైకి చూశావు. నాకూ స్మృతి వచ్చింది. అది రాణివాసంకదా అని వెంటనే మరలినాను.

సీత

[ ఆశ్చర్యంతో ]

ఏమిటీ, నిరుడు ఆయుధపూజనాడు ఆ వింతరంగుల విమానంలో వెళ్లినది...

రావణుడు

ఔను, నేనే!

సీత

ఎవరో విదేశీయులు పండుగలుచూడడానికి వచ్చా చేటిని పంపించాను యంత్రశాలనుంచి ఆహ్వానించ

ఆశోకం

రావణుడు

అయ్యో, తెలిసికోలేకపోయినాను. అంతఃపురం అటు చూడరాదని దాటిపోయాను.

ఇంతకూ ఆ నిమిషం నేను ఏదో అయిపోయినాను, నాకు స్పృహలేదు. ఆ పోవడం పోవడం కాంచనగంగా శిఖరం మీదుగా త్రివిష్టపం చేరుకున్నాను. ఆ పగలూ; ఆ రాత్రి అంతా అక్కడనే గడిపాను. నేను ఇంతకాలం అన్వేషిస్తున్నా ఆనందాన్ని దర్శించాననిహృదయం వెర్రిగా చేసివేసింది. నాటినుంచీ నేటివరకూ ఒకే నిరీక్షణతో ఉన్నాను, ఈ శుభదినం, ఈ స్వయంవరం...

సీత

[నిట్టూరుస్తూ సఖితో]

మధువు తీసుకురా.

రావణుడు

[ఆత్రపాటుతో చెమర్చుతూవున్న ముఖం తుడుచుకుంటూ]

సీతా, నామనస్సు విప్పిచెప్పడానికని వచ్చాను. సాటుగా ఏమీ తోచడంలేదు. నన్ను క్షమించికోవాలి

సీత

రావణా, నాకు జనకులయందు సంపూర్ణవిశ్వాసం. వారిమాటకు సూటిగా నడుస్తాను. రేపేగదా స్వయంవరం.

[ నిట్టూరుస్తుంది ]

రావణుడు

[ గద్గదికతో ]

సీతా, నన్ను గ్రహించావా ?

సీత

అర్థం చేసుకున్నాను.

రావణుడు

ధన్యుణ్ణి! ఆ అనుగ్రహం చాలు !

సీత

రావణా, రేపటిదినం...

[ చెలికత్తె మధువు రావణునికీ సీతకూ ఇచ్చి దూరంగా నిలుస్తుంది ]

రావణుడు

[ పక్కను పెట్టి ]

సీతా, విస్తారం మాట్లాడుతూవున్నానేమో, కాని ఒక్కటే నన్ను బాధిస్తూవున్నది: నేను మహేశ్వర

ఆరాధకుడను. శివకార్ముకాన్ని వంచడమంటే మనస్సు మహాకలవరపడుతూవున్నది.
[ సీత తల ఊపుతుంది ]

రావణుడు

స్వయంవరానికి వచ్చినవారిని అందరినీ ఎరుగుదుము. అందరిలోనూ ఇందులకు సమర్థులు ఇద్దరే: అయోధ్యా రాజకుమారుడు రాముడూ, నేనూ. రాముడు సమర్థుడు. అతనికీ నాకూ ఒక్కటే భేదం యిందులో: అతనికి శివకార్ముకం అని సంకోచం లేదు. నాకా గురుని ధనుస్సు ఒకకోర్కె ఫలించడానికి ముట్టడమూ అని గుండెలలో ఒకనీరసం దిగలాగుతూ ఉన్నది. అందుచేత ఇక ఆలోచన భయంకరంగా వున్నది. సీతా! ఎంతో సమాధానపరచుకుంటున్నాను. ఇంతకాలం జీవితమంతా దేనికోసం పరితపించిందో దాన్ని పొందేటప్పుడే ఇంత విషమసమస్య ప్రాప్తిస్తుంది అనుకోలేదు.

ఒక్కటేసందేహం కలవరపెడుతూ ఉన్నది. నేను రామునివలె ఒకభార్యను స్వీకరించడానికీ, నా ప్రతాపాన్ని చూపడానికీ రాలేదు. ఏతీవ్రవాంఛతో జీవితం

పెర్రి పరుగుగా తిరుగుతూ బాధపడినానో ఆకోర్కె ఫలించే టప్పుడే నా కీవిషమస్థితి ప్రాప్తించినది. నేను సాధించ లేనిది లే దనే గర్వని. గురుకార్ముకసమన్య కాకపోతే నీకోసం నేను సాధించలేనిది లేదు. అయినా నీకోసం అపరాధమనిపించినాసరే ఇందుకూ పూనుకుంటున్నాను. నేను లోపల పడుతూవున్న ఈ తీవ్రాందోళన ఈ జీవితంలో ఇంతవరకూ ఎరగను.

[ ఆగి ]

సహృదయురాలవు, సత్యాన్ని గ్రహించగలవు గనుక బహిరంగంగా చెప్పుతాను: శివకార్ముకాన్ని ఎక్కుపెట్టడములో మహాగురువుమీాది భక్తివల్ల హృదయం కంపించి నే నోడిపోవచ్చును. అప్పుడు జయించే వాడు రాముడే! నీవు,... నీవు...

[గద్గదికతో]

నీవు రామునిభార్యవవుతావు.... కాని రాముడు భర్త కాడు. అతని ఆశయం ప్రజలకు ఆదర్శనీయమైన ప్రభువుగా కావలెనని. అతని ఆదర్శం అతనికీ నీకూ సుఖాన్ని కూర్చదు. జీవితసమస్తం నీపాదాలదగ్గరపెట్టి

నిన్నారాధించగల ప్రియుడు కావలెనని నీహృదయం ఏనాడైనా సరే కోరితే ఆనాడుకూడా ఈ రావణుడు నీకు లభ్యుడని యెంచుకో. ఉన్మత్తుడనై చెప్పినది కాదు, సీతా!

సీత

[ చాలాసేపు ఆగి ]

నా స్వబుద్ధి ఇందులో వీలులేదు రావణా, సర్వం విధికీ, జనకులకూ వొదులుకున్నాను. రేపు అందరి సమస్యలూ పరిష్కారం.........

రావణుడు

సీతా, బ్రతుకంతా తపస్సుగా శివుణ్ణి పూజించాను. ఇప్పుడు ఇన్నాళ్ల బ్రతుకు వేదనఅంతా నిన్ను కోరుకుంటున్నాను. గురువు రేపు పరీక్షిస్తాడో లేక...

చేటి

అమ్మా, మహారాజులు...

రావణుడు

రేపు స్వయంవరానికి...

సీత

రావలసింది.

రావణుడు

కృతజ్ఞుణ్ణి! సీతా, సెలవు.

సీత

సెలవు.

[ రావణుడు సీతకళ్లకేసి చూస్తూ, చూపు తిప్పలేక కొంచెం ఆగి, యత్నంతో శరీరాన్ని కదుపుకుని వెళ్లిపోతాడు ]

[ తెర అగుతూ ]

# 2

[సాయంత్రం. నగరు లోపలిభాగం. ఉద్యానవనం వైపు చూస్తూ వున్న గది. హంసకెమ్మాలో సువాసనధూపం వింతగా గాలితో పెనవేసుకుంటూ స్త్రీశరీరంకన్నా అందంగా వొంపులు తిరుగుతూ ఆకాశముఖంగా వొయ్యారంగా ప్రయాణిస్తూవుంది. మందమారుతం నాజూకుసౌరభాలను నెమ్మదిగా తెస్తూవుంది. సీత తోటలోని పూలతీగలమీదుగా ప్రపంచాన్ని అర్ధనేత్రాలతో కలలు కలలుగా కంటూవున్నది. చేటి నెమ్మదిగా ప్రవేశించి తెచ్చిన పువ్వులు బల్ల మీదసెజ్జలో సర్దుతూ]

చేటి

అమ్మా, అయోధ్యారాజకుమారులు రామచంద్రులు ఎరుకపరచమన్నారు.

సీత

రమ్మను.

[సర్దుకుని కూర్చుంటుంది]

[రాముడు ప్రవేశం. వయస్సు ఇరవై సంవత్సరాలవలె కనిపిస్తాడు, ఎప్పుడూ లోపలకు ఆలోచించుకునే కన్నులు. సీత లేచి ఆహ్వానిస్తుంది]

రాముడు

మిథిల, అయోధ్యకన్నా ఇంత అందమైనప్రదేశమని అనుకోలేదు.

సీత

అయోధ్యలో వున్నంత గొప్ప సౌధాలూ, వింతలూ ఇక్కడ లేవని అంటారే!

రాముడు

మీ ఉద్యానవనాలకు తూగేవి మా రాజ్యంలో లేవు.

సీత

ఆ తరువులు రెండూ కాశ్మీరునుంచి జనకులు ప్రత్యేకం తెప్పించారు.

రాముడు

చాలా అందంగా ఉన్నవి!

సీత

ముఖం కొంతబడలికను సూచిస్తూవున్నది.

విశ్వామిత్రుల ఆశ్రమంలోనూ, దారిలోనూ కొంత శ్రమ కలిగి నట్టు కూడా విన్నాను.

రాముడు

అందువల్ల కాదు. నదీవనాదుల సౌందర్యం చూడ వలెననే అభిలాషతో గురుదేవులూ, తమ్ముడూ, నేనూ కాలినడకను వచ్చాము.

సీత

కాలినడకనా !

రాముడు

ఇంతకూ ఇప్పుడు చూడడానికి వచ్చిన కారణమేమి టంటే: నేను మనస్సు విప్పి చెప్పవలసిన విశేషాలు వున్నవి. సావకాశంగా వినవలసింది.

సీత

మంచిది.

రాముడు

నేను జీవితాన్ని ఒక ఆశయానికి గురిగా చేసికొందలచు కున్నాను. ఆశయాలు ప్రధానంగా ఎంచుకున్న

ప్రాణికి జీవితం కంటక ప్రదం. నా ఆశయం: ఆదర్శ ప్రాయమైన జీవితాన్ని గడుపుతూ, 'రాజు' అన్నవాడు ప్రజలయెడ ఎటువంటి ఆదరానురాగములు చూపి, తనకు అందువల్ల ఎన్నినష్టాలు కలిగినా భరించి, ఎన్నికష్టాలు తటస్థించినా వోర్చి, ప్రజలసౌఖ్యాలకు తన సౌఖ్యాలను త్యజించి, 'జనవాక్యం కర్తవ్యం'గా ఏవిధిని ఉండవలెనో, ఆ విధంగా బ్రతుకంతా గడపవలెనని!

సీత

ఒకవేళ ప్రజలు కోరరానికోర్కెలు కోరితే?

రాముడు

ప్రజలు అంతటి దుర్మార్గులు, మూర్ఖులు కారు అని నా అభిప్రాయము. అటువంటి కోర్కెలు కోరరు.

సీత

ఔను, ప్రజలు చాలామంది అమాయకులే, కాని కొందరు తుంటరులు లేరా? ఆ తుంటరులు ప్రజల ఆ అమాయకమునే కొంతవరకూ ఆకర్షించగలుగుతారు గదా, ఒక్కొక్కప్పుడు!

రాముడు

అవును. అది సంభవమే; సంభవమేకాదు తథ్యము. అటువంటి సందర్భాలలో నేను, సత్యాన్ని కాలం తెలియ బరచడానికి విడిచి, ఆ ప్రజావాక్యాన్నికూడా పాటించుతాను. కాలం సత్యాన్ని ప్రకటిస్తుంది, ధర్మాన్ని గెలిపిస్తుంది; తాత్కాలికంగా కష్టం నేను భరించుతాను.

సీత

ఎందుకూ, అటువంటి ప్రజాభిప్రాయాన్ని అణిచి నిర్మూలంచేసి పాలించరాదూ? ఊరికే ఆశయంహృదయాన్ని గ్రహించడానికి అడుగుతున్నాను.

రాముడు

ఆ అడగడం చాలా సంతోషం. ఎందుకంటే నన్ను అర్థంచేసుకొని, నా ఆశయాలను అంగీకరించి, అనుజ్ఞ ఇయ్యకపోతే రేపటి స్వయంవరంలో నాకు నిమిత్తం లేదు.

సీతా! ఎందుకంటే నాభార్య అన్నింటిలో నా సహధర్మచారిణిగా ఉండవలె. ఆమె అందరిభార్యలవంటి భార్య కానేరదు. ఎరుగుదును, నేను ఎంచుకున్న జీవితం

ఎన్నో కష్టాలకు నన్ను గురి చేస్తుంది; ఏ నీరసనమయం లోనో నేనే లొంగి దారితప్పేటంతటి బాధలుకూడా రాగలవని నాబుద్ధికి ఇప్పుడే తోస్తూఉన్నది. నా సహ ధర్మచారిణిగా నిలిచే ఆమెకు ఎంత వేదన కలుగుతుందో నేను గ్రహించగలను.

స్త్రీహృదయం నేను ఎరుగుదును: కష్టాలకు ఓర్చు కునే మహత్తరమైన సహజశక్తి ఉన్నది దానిలో. తనకు కలిగిన కష్టాలను ఓర్చడమే కాకుండా, ఇతరులకష్టాలను చూసి స్వవిషయంకన్నా బాధపడే ఒక గొప్ప విశేషత వున్నది స్త్రీ అనే ఆ అద్భుతసృష్టిలో!

సీత

[ఎంతో గౌరవంతో చూస్తూ]

ఈ వాక్యాలు నాకు సిగ్గు కలిగిస్తూవున్నవి.

రాముడు

స్వభావంలోవున్న మార్దవంచేత! నీవు జనకులకు అల్లారు ముద్దుబిడ్డవు, ఆయన నిన్ను తమ కన్నులవెలు గుగా పెంచుతున్నారు.

సీత

అయ్యో, వృథాగా అడ్డువచ్చాను. నాసంగతి కేమి? ఆ ఆశయంసంగతి పూర్తిగా వినవలెనని ఆతురతగా ఉన్నది.

రాముడు

పూర్తిగా గ్రహించేవరకూ తర్కించుకోవలసినదే ఈ విషయం.

సీత

ఔను, సంపూర్ణంగా అర్థంచేసుకోవలెనని నాకూ వున్నది.

రాముడు

ప్రజాపాలనను అంగీకరించినరాజు ఎల్లకాలములా ఏవిధంగా ఉండవలెనో అటువంటి ఆదర్శాన్ని నా జీవితంలో చూపవలెనని నా ఆశ. నన్ను చెట్టబట్టిన సహధర్మచారిణికూడా నా ఆశయాన్ని గ్రహించి అందులకు తగిన తేజస్సునూ బలమునూ కూర్చే దేవి కాకపోతే వీలులేదు. నాపూనిక ఎటువంటిదంటే, అవసరమైనప్పుడు, నా ఆదర్శంనిమిత్తం, ప్రజలనిమిత్తం నా సర్వ

సౌఖ్యాలను విడనాడడమే కాకుండా, రాజ్యాన్ని...

[తలవంచి]

ఎంత భరించరానిదయినా కళత్రాన్ని సహితము విసర్జించుతాను...

[సీతకన్నులలోనికి చూస్తూ]

అందుచేత రేపు స్వయంవరానికి నేను ప్రవేశించే లోపున బాగా ఆలోచించుకొని, నన్ను పూర్తిగా గ్రహించుకుని, నా ఆశయాన్ని అంగీకరించి, నావల్లను జీవితంలో కలగబోయే బాధలు ఓర్చుకోగలందులకు మనస్ఫూర్తిగా అంగీకారమైతే నాకు అనుజ్ఞ పంపవలసింది. ఆ అనుజ్ఞ రానిదే, నేను స్వయంవరానికి రాలేను.

[ఇద్దరూ చాలాసేపు నిశ్శబ్దం]

సీత

[సన్ననిగొంతుకతో]

రామా, శివునిధనస్సు సామాన్యులు ఎక్కు పెట్టలేరనీ, అంతటి మహాపురుషుడే నా అదృష్టంవల్ల నాకు తోడునీడ కాగలడనీ, స్వయంవరం ప్రకటించేముందు జనకులు చెప్పినారు. నాకు జనకులమీద ప్రేమా, గౌరవమే కాకుండా,

వారి సత్సంకల్పమునందూ, పవిత్రతయందూ ఎంతో విశ్వాసం. అందుచేత సమస్తమూ జనకులకూ, విధికీ విడిచిపెట్టాను. ఇక కష్టాలకు నేను వెరవను. క్షమకు మా తల్లి తరవాత. ఆమె పుత్రికను అనిపించుకోగలిగినంత పరీక్ష నా జన్మలో కలిగితే సంతోషమే. ఈ ఆశయాలు గొప్పవి. ఇవి నన్ను భయపెట్టడం లేదు సరే గదా, ఆకర్షిస్తూ ఉన్నవి కూడా.

రేపటిసంగతి: నా భవిష్యత్తును విధికీ విల్లునకూ ముడిపెట్టి సమస్తమూ పవిత్రులు జనకులకు విడిచిపెట్టాను. ఇక నా స్వబుద్ధి లేదు. రావణుడు కూడా ప్రశ్నిస్తే ఇంతే చెప్పాను ...

## రాముడు

రావణుణ్ణి కలుసుకున్నాను. ప్రణయస్వరూపిణి అయిన దేవికై తాను లోకమంతా భ్రమించి ఆ పవిత్రమూర్తిని నీలో దర్శించాననీ, అందుచేతనే శివకార్ముకమైనా యత్నిస్తున్నాననీ అన్నాడు. అతను పూర్తిగా ప్రియుడు. జీవితం ప్రేమగా సుఖంగా అనుభవించడం వినా ఇతరం ఎంచడు...

సీత

ఔను, ఏమీ దాపరికం లేకుండా విస్పష్టంగా చెబితే విన్నాను.

రాముడు

కాని, సీతా, నా ఆశయం అందుకు పూర్తిగా భిన్నం

సీత

ఔను

రాముడు

మరి, రేపు స్వయంవరానికి...

సీత

రావలసినది. నేను సర్వం అర్థంచేసుకున్నాను. ఆ ఆశయాలు అంగీకారమే.

రాముడు

కృతజ్ఞుణ్ణి! అంతకన్నా వేరు ఏమీ వొద్దు. నన్ను గ్రహించి, నా ఆశయాలు అంగీకరిస్తే చాలు. చాలా శ్రమ కలిగించాను.

సీత

ఆహా, శ్రమ యేమిటి?

రాముడు

ఇక నేను సెలవుతీసుకుంటాను.

చేటి

[ప్రవేశించి] అమ్మా ... ...

సీత

[లేచి] సెలవు.

రాముడు

సెలవు.

[నిష్క్రమణ]

[తెర, ఆలసంగా]

# పంచవటి

## 1

[గోదావరీతీరం. చిక్కగా అల్లుకున్న తమాలవృక్షాలక్రింద నీటుగా కనబడుతూవున్న పర్ణశాల. కుటీరంచుట్టూ మల్లె, జాజి, రేరాణి, మందార విరియబూస్తూ సువాసనలు విదజల్లుతూ ఉన్నవి.

ఒక జింకపిల్ల చెట్టుమీద వాలిన కాకిని చూసి గంతులువేస్తున్నది. రాముడూ, సీతా సోపానంవలె యిమిడిన శిలమీద పారిజాతంనీడను కూర్చున్నారు. సీత ఆలోచనలో మునిగివున్నది. రామునికళ్లు కదిలి పోతూ ఉన్నవి.

సీతభుజంమీద చెయ్యివేసి దగ్గరగా తీసుకుంటాడు. ఆమె దీర్ఘంగా నిశ్వసిస్తుంది.]

రాముడు

[దుఃఖంగా]

సీతా, ఈ రాముడు నిన్నెన్నికష్టాలు పెడుతున్నాడు ...

సీత

[తొందరగా]

అట్లాఅనవొద్దు. నా రామచంద్రుడు పక్కను వుండగా నాకు కష్టాలా! ఎప్పుడూ అట్లా అనుకోవద్దు.

రాముడు

కాదు, సీతా, నీవు సుకుమారివి...

సీత

[అడ్డువచ్చి]

నీవుమాత్రం సుకుమార రాజకుమారుడవు కావా! నేనేనా అంత కష్టాలకు ఓర్వ లేనిదానను?

రాముడు

అయినప్పటికీ చిన్నతనంనుంచీ విలువిద్య, గుర్రపు స్వారి, మల్లయుద్ధం నేర్వడంలో ఈ శరీరం చాలా శ్రమలకు అలవాటుపడినది. నీవు...

సీత

ఏమీ, నేనుమాత్రం విలువిద్యా, గుర్రపుస్వారీ ఎరగనా? నేనూ శ్రమలకోర్చి విద్యలు నేర్చుకున్నాను.

నీవెంత సుకుమారుడవో నేనూ అంతే సుకుమారిని. నీకే భరించడం కష్టం. నీకు ప్రజలు, రాజ్యం, తల్లులూ అనే ఆలోచనలు ఉండడమువల్ల ఇతర బాధలుకూడా వున్నవి. నాకు ఒక్క రాముడే, ఇంకేమీ అవసరం లేదు. నా రామచంద్రుడు నాకక్కనే వున్నాడు, నాకు ఏ విచారమూ లేదు.

రాముడు

[ప్రేమతో సీతను కౌగిలించుకుని]

సీతా, ధైర్యసాహసాలలో, ఓరిమిలో, బలంలో తక్కువని కాదు. స్త్రీవని కాదు. కాని, అంతఃపురాలలో జీవితం ఒకే ఆనందంగా, నిశ్వాసమంటే యెరగకుండా ఉండే నీవు, అడవులపాలు కావడము నావల్లను కదా అని...

సీత

రామా, సహధర్మచారిణినికదా అని, ఇట్లా రాకపోతే ప్రజలు ఏమనిపోతారో అని

[రాముడికి కళ్లు తోలకాడుతవి]

వెంట రాలేదు. నీ బాధ్యత లేదు. నీవు రమ్మంటే బానిసగా రాలేదు. రామునితో జీవితంవినా సీత లేదు.

అడవులలోనూ ఆనందం వున్నది. నా రామచంద్రుడున్నాడు, నాకు ఏమీ అక్కరలేదని వచ్చాను.

రాముడు

సీతా కృతజ్ఞుణ్ణి, ధన్యుణ్ణి! ఆనాడు నా అరణ్యవాస మయ్యేవరకూ మిథిలలో వుండమని అన్నాను, నావల్ల నీకు కష్టాలు ఎందుకు అనే భావంతోనే. అప్పుడే లోపలి నుంచి హృదయం సీత దండను లేనిదే జీవితం భరించ గలవా? అని పొడిచింది.

సీత

[రాముణ్ణి కౌగిలించుకుని ఒక్కత్రుటి తల అతనిభుజంమీద వాల్చి, నిట్టూర్చి]

రామా, నాకు యేమీ వొద్దు, రాణివాసం, రాజ్యం, ప్రజలు ఏమీ వొద్దు. ఇక్కడ ఈ పర్ణశాలలో ఇట్లా కలకాలం సుఖంగా ఉండిపోదాం! ఈ లేళ్ళగుంపులూ, ఈ గోదావరి సన్ననిసంగీతమూ, ఈ పువ్వులూ ఈ లతలూ ఈ తమాలములూ నా రాముడూ నాకు చాలు!

రాముడు

సీతా, నీ ప్రేమ నా జీవితంగట్లు పొర్లిపోతూవున్నది. నీవు లేకపోతే బ్రతుకు దుర్లభం. కాని సీతా, నాకు ఈ సౌఖ్యాలతో తృప్తిలేదు. ఇంతకన్నా యెక్కువ ఏదో వున్న దనిపిస్తుంది: ఎప్పుడూ సౌఖ్యాలు అనుభవిస్తూ, జీవితం అవిచ్ఛిన్నమైన ఆనందంగా, జీరలేని సంగీతంగా, అమృతప్రాయంగా గడపవలెనంటే రావణుడే తగిన వాడు

[సీత గుచ్చుకుపోయేచూపు చూస్తుంది రాముణ్ణి]

కాని సీతా! నేను సాధారణభర్తగా, నీవు సాధారణ భార్యగా, ప్రాపంచిక సౌఖ్యాలను సంపూర్ణంగా సుఖైక రతిలో ఆనందించి తరలిపోవలెనని లేదు. యుగ యుగాలు, కాలాంతం, ప్రపంచానికి వెలుగుదారి చూపుతూ, నిర్మలతేజస్సుతో ఆకాశగర్భాంతర్భాగం నుంచి దివ్యతేజస్సు వెదజల్లే తారగా నిన్ను నిల్ప వలె నని, నీ పక్కనే నేను ఆ విధినే నిలవవలెనని ఉంటుంది. ఒక్కొక్కప్పుడు నీ పవిత్రప్రేమ ప్రవాహంలో, ఆ అమృతవాహినిలో మునిగి కొట్టుకుపోతూ

న్నప్పుడు, నీ వలపుమెరుపు నా కన్నులు మిరుమిట్లు గొలిపినప్పుడు, ఈ ధన్యజీవితం సుఖస్వప్నంగా తరలి పోవడానికి ఈ అపూర్వప్రేమ చాలు, నాకు సీతచాలు, అన్యచింత లేకుండా మైమరచి నీక్రీగంటినీడలో చల్లగా హాయిగా పరిపూర్ణానందంతో ప్రేమోన్మత్తుడనై నిలిచిపోతే చాలదా, అనుకుంటాను.

ఆ నిమిషం, స్థూలదృష్టికి కనబడని ఒక తర్జని, 'రామా, ఒక గుండెనిద్దా, ఒక ముందువెలుగు, ఒక నాల్గవపురుషార్థము కల్పించడానికి సృష్టికోరిన మహాదేవత సీత! నీ ఆనందము పొరలుకప్పుతూవున్నది, నీ ఆశయం మరుగుపడుతుంది జాగ్రత్త' అని నాకు దారి చూపుతుంది. నీవు నాదృష్టిలో మహాదేవిగా ఉన్నత స్థానంలో గోచరించుతావు. నీవు కేవలం సౌఖ్యాలనే ఆసించుతే భౌతికజీవితానందం అనుభవించడంలో అద్వితీయుడు, తన సమస్తమూ నీకు ధారపోసి ఎడతెగని ఆనందంలో ఓలలాడించే శక్తిగలవాడూ అయిన రావణుడే నీకు...

[సీత రాముని నోరు మూస్తుంది. ఆలింగనంలో వున్నారు; ఇంతలో 'సీతారామా!' అనే గంభీరస్వరం వినబడుతుంది. ఇద్దరూ ఉలికిపడ తారు]

రాముడు

ఈ గంభీరస్వరం ఎవరిది?

సీత

రావణుని గొంతులా వున్నది.

రాముడు

ఔను కదూ, నీకు ఎంతజ్ఞాపకం!

[రావణుడు ప్రవేశిస్తాడు. వెంట లక్ష్మణుడు చేతిలో విల్లుతో ఒక్క అడుగు వేసి ఆగిపోతాడు. రావణుణ్ణి సీత ముందు చూస్తుంది. రావణుడు చేతులెత్తేటప్పటికి సీతా రాముడూ అభినందిస్తారు]

సీతారాములు

రావణా, సుస్వాగతం!

రావణుడు

ధన్యోస్మి! రామా, లక్ష్మణుడు ఏం తీవ్రంగా వున్నాడు

రాముడు

ఏమి?

రావణుడు

నన్ను పోరాదని వారించి, తొందరగా విల్లు తీశాడు. అతనికి సీతాదేవిమీది గౌరవాన్ని పాటించి విరోధం పూన నన్నాను.

[లక్ష్మణుడు ఇంకా తీవ్రంగా చూస్తున్నాడు రావణుణ్ణి]

రాముడు

[చిరునవ్వుతూ]

తమ్ముడూ, రావణుడు అతిథి, గౌరవార్హుడు.

[రావణునితో] తొందర.

[లక్ష్మణుడు కుటీరం వెనుక ఉన్న చీకటిచెట్ల క్రిందికి వెళ్ళిపోతాడు]

నీ రాక చాలా వింతగా ఉన్నది. ఇప్పుడే నీసంగతి చెప్పుకుంటున్నాము ప్రసంగవశాత్తు.

రావణుడు

సుహృద్బాంధవులు మిమ్మల్ని ఎరగనా!

సీత

[చిరునవ్వుతో]

రావణా, ఇక్కడ ఆసనాలు శిలలు, ఆతిథ్యం చల్లని గోదావరీమారుతాలూ, వనలతల సౌరభాలూ. ఇంత

కన్నా నీవు కోరడానికి వీలులేదు. అందుచేత ఆ శిలా వేదిమీద కూర్చో.

రావణుడు

[సంతోషంగా]

మీరు ఎక్కడఉంటే అక్కడనే ఆనందం ఉంటుంది. మీ అపూర్వహృదయాలు ఇచ్చే ఆతిథ్యంకన్నా చల్లనిఆతిథ్యం లేదు.

సీత

నీది పొరబాటు. మాకు ఇక్కడ శబరి యిచ్చిన ఆతిథ్యం చూస్తే ఇట్లా అనవు.

రావణుడు

ఔను, విన్నాను ఆ మహాభక్తురాలి కథంతా. సీతా రాములకు జీవితసర్వస్వంలోని అమూల్యాన్నీ అర్పించి ఆహ్వానించనివారు త్రిలోకాలలోనూ ఉండరు.

రాముడు

రావణా, శబరిచరిత్ర ఆచంద్రతారం నిలుస్తుంది సుమా! ఏమి వాళ్లుతెలియని భక్తి, నన్నుచూసి నేనే సిగ్గుపడేటంతగా...

రావణుడు

నేను ఆ శబరిని కాకపోయినానే అని ఇప్పుడు సిగ్గు పడుతున్నాను.

సీత

ఏమి చమత్కారం !

రావణుడు

ఇది చమత్కారాని కన్నమాట కాదు, నా గుండెలలోనుంచి వచ్చినది.

రాముడు

[చిరునవ్వుతూ]

లంకేశ్వరులకు ఇటువంటి స్థితి ఎందుకు ?

రావణుడు

నేను వచ్చిన కార్యానికి బెదురు కల్పించారు.

సీత

ఏమిటి ఆ కార్యము ? మా చేతనైనంత సహాయం చేస్తాము. చెప్పక సందేహ మెందుకు ?

రాముడు

సావధానంగా ఉన్నాము. ఏమిటా కార్యము ? మా వల్ల కాగల దయితే...

రావణుడు

మీవల్ల కాదగినదే.

సీత

అయితే ఈఆందోళనా, ఆలస్యం ఎందుకు?

రావణుడు

మీరు అంగీకరించరేమోఅని సంకోచం.

సీత

అబ్బా, ఈఘోషంతా యెందుకు అసలు చెప్పక!

రావణుడు

మీరు అయోధ్య విడిచిననాటినుంచీ నేను ఆందోళనలోనే ఉన్నాను. కైకకు లోబడిన మీతండ్రి దశరథుని కోరిక ప్రకారం మీరు పధ్నాలుగుసంవత్సరాలు అరణ్యవాసం బయలుదేరినట్లు విన్నాను. మీరు చిత్రకూటంలో ఉండగానే దర్శించవలె ననుకున్నాను, కాని మీరు అంగీకరించరని, అయినా యత్నించవద్దా అని, ఇంతకాలం ఆలోచనలో వ్యర్థపరిచాను. నిన్న శబరికథ వినగానే మహాసిగ్గుపడ్డాను, నేను మొదటివాడను కాక పోయినాను కదాఅని.

సీత

అబ్బా, ఎంతకూ అసలు చెప్పవే!

రావణుడు

మీరు ఈ అడవులలో బాధలు పడడం నాకు కష్టంగా వున్నది.

సీత

నీకు తెలియదు ఇవి కష్టాలనుకుంటున్నావు. మాతో ఉంటే నీకూ ఇందులో సౌఖ్యం తెలుస్తుంది.

రావణుడు

ధన్యుణ్ణి, అంతకన్నా నా!

రాముడు

రావణా, నీ ఆలోచన విశదం కాలేదు.

రావణుడు

నాది చిన్నకోర్కె ఉన్నది.

సీత

చెప్పవేం?

రావణుడు

నన్ను అపార్థం చేసికోవద్దు. నాకు సీతయెడలా,

నీయెడలాగల ఆదరాభిమానాలూ, ప్రేమా మీకు తెలు సును. మీరు ఈ అడవులలో బాధలు పడడము నాకు కష్టంగా వున్నది ఈ పంచవటికి లంక అయోధ్య కన్న దగ్గర. మీరు లంకాపురికి వచ్చి, అక్కడ మిగతా కాలం గడపండి.

రాముడు

రావణా, నీ ఆదరానికి కృతజ్ఞులము, కాని వీలు కాదు.

రావణుడు

విను. నేను లంకా,రాజ్యాన్ని, సమస్తమూ మీ అధీనం చేస్తాను. నాకు తెలుసును, నే నక్కడఉంటే కొంత అపకీర్తి కలుగుతుం దని. అందుకని నేను ఇంకా ఆగ్నేయంగా పోయి అక్కడ నూతనరాజ్యస్థాపన చేసు కుంటాను. సీత ఈఅడవులలో, ఈచిక్కులు, చాలా బాధగా వున్నది రామా!

సీత

నీ మనస్సూ, ఆ పవిత్రత గ్రహించక అనుకోకు, కాని ఈజీవితంలోనూ అనిర్వచనీయమైన ఆనందం ఒకటి ఉన్నది.

రాముడు

సీత చెప్పినదీ నిజమే. అదిగాక నీవు ఇంత ప్రేమతో ఆహ్వానించినా అంగీకరించడానికి వీలులేదు. క్షమించు. పితృవాక్యపరిపాలనకు అంగీకరించిననాడు సీతను మిథిలకు పంపి ఒంటరిగా బయలుదేరవలె ననుకున్నాను, కాని ఆమె అంగీకరించలేదు. అప్పుడే దీనిలో ఏదో విధిప్రాబల్యం ఉన్నది అనుకున్నాను.

రావణుడు

రామా, నేను మునిగి తేలలేనిలోతు ఏదో నీలోనుంచి నన్ను ఆకర్షిస్తూఉన్నది.

సీత

రాముడు నీకు విశదమవుతున్నాడు.

రావణుడు

నేను లంకలో వున్నప్పటికీ, ఎంతఅనుభవానికి అవకాశాలున్నప్పటికీ మీమీదనే దృష్టి నిలిచి బాధగా ఉంటూవున్నది.

సీత

[బాధతో]

మే మేమి చేయగలము.

రాముడు

రావణా, సీతఓర్పు నీ వెరగవు. నాకే అవసరమైన ధైర్యాన్ని కూరుస్తుంది. మాస్థితికి నీవు అంత ఆలోచించ నవసరం లేదు.

రావణుడు

అవును. ముందే అనుకున్నాను ఇదంతా. అయినా, ఎప్పుడు కోరినా లంక మీయధీనం. నేను మీ యిష్టానువర్తిని. సీతకోసం ఏది చెయ్యమన్నా సంసిద్ధుణ్ణి.

సీత

రావణా, నీవూ రాముడూ నా ప్రశంసమాత్రమే ఆలోచిస్తున్నారు; కాని, నీలో ఒక గొప్పశక్తి ఓరిమిని తెలుపుతూన్నది, నేను వెనుతీసేటట్టుగా.

రాముడు

ఔను. వీరిలో ఒకగొప్పఉదారత వున్నది. నిన్న మీచెల్లెలు వచ్చి, ఇక్కడనే వుండి మా కష్టనిష్ఠురాలకు తోడ్పడతానని ఎంతో పట్టుపట్టినది. వారించడం మహాకష్టమయింది. సీత ఎంతో బ్రతిమాలితేగాని వదలలేదు.

రావణుడు

సరే, ఎప్పుడూ మీ అధీనుల మని ఎంచుకుంటే చాలు.

సీత, రాముడు

ఎంతమాట!

సీత

భోజనసమయం అయింది.

రాముడు

లక్ష్మణా, రావణునకు నీ ళ్ళిప్పించు!

సీత

లక్ష్మణు డెందుకు, నేను ఇస్తున్నాను.

[ముగ్గురూ పర్ణశాల ప్రవేశిస్తారు]

[తెర శాంతంగా]

## 2

[పంచవటిదగ్గరనే గోదావరిఅవతల,అరణ్యం. రావణుడు చెల్లెలిని కలుసుకున్నాడు. ఆమె ఎవరినైనాసరే ఆకర్షించగలిగినంత అందంగా ఉన్నది.]

రావణుడు

ఈప్రాంతాలకు ఎందుకు వచ్చావు శూ?

శూ

[నవ్వుతూ]

నీవు ఎందుకువచ్చావు?

రావణుడు

ఎరగనట్టు అడుగుతున్నావు, సీతను చూడడానికి.

శూ

విశేషా లేమిటి? నేను నీకు సహాయం చెయ్యడానికి వచ్చాను.

రావణుడు

అలాగా, ఏంసహాయం చెయ్యగలవు ?

శూ

నీకు సీత లభించేటట్టు చేస్తాను. విను నవ్వడంకాదు...

రావణుడు

ఇది హాస్యాస్పదంగానే వున్నది. సీతహృదయం వూర్తిగా గ్రహించాను. ఆమె రాముని అణువు అణువునా ప్రేమిస్తూవున్నది. నాకే ఆనందంకలిగినది వాళ్ల అద్భుతజీవితాన్ని చూస్తే.

శూ

నీవు యుద్ధంలో ఎంతదిట్టరివో స్త్రీలపట్ల అంత బేలవు. అందుచేతనే ఈనాటికికూడా నీకు సంతృప్తి నిచ్చే ప్రేమను సంపాదించలేకపోయినావు.

రావణుడు

వింతగా మాట్లాడుతున్నావు శూ !

శూ

ఇదంతా కాదు, నేను చెప్పేమార్గం అనుసరించు.

రావణుడు

నే నింక లాభం లే దనుకున్నాను సరేగదా, మరొక ఆలోచన పాపమనికూడా అనుకుంటున్నాను. ఇక సీతకోసం ఏకాంతంలో అలా కాలి కాష్ఠంగా నుసిగా అయిపోతాను.

శూ

ఛా, పిచ్చిమాటలు మాట్లాడకు.

రావణుడు

శూ, నీవు ఎగరవు. సీతాసందర్శనం తొలిసారి కలిగిన నాటినుంచే ఈ అన్న పూర్తిగా మారిపోయి నాడు. నాకు బ్రతుకంతా, ప్రపంచమంతా, సీత, సీత, సీత...

[ఆకాశంచూస్తూ నిట్టూరుస్తూ]

సీత, సీత, సీత !

శూ

[తల నిమురుతూ]

అన్నా, విను, ఇంతగా నిరాశచేసుకోవలసిన అగత్యం లేదు. నేను రాముణ్ణి ప్రేమించాను. నా జన్మలో

అంత అందమైనవానిని చూడలేదు. నేను అతనికోసం ఏమయినాసరే చేస్తాను. అతనికోసం మహాబాధపడుతు న్నాను. కాని నీసంగతే చాలా వింతగా ఉన్నది. సీత కన్నా అందగత్తెలను నీవు ఎరుగుదువు.

రావణుడు

నీవు, ఆసంగతి మాట్లాడకు. నీవు గ్రహించలేవు నాలో కలిగినమార్పు.

శూ

[నవ్వుతూ]

ఏంవింతగా అయిపోయావు! కాని విను, నిన్న చాలాసేపు వాళ్లదగ్గర ఉన్నాను. లక్ష్మణుడు వట్టి శుంఠలా కనపడతాడు; వెళ్లరా దని ఆవుజేశాడు. ఇంతలో రాముడు వచ్చి ఆహ్వానించాడు. ఎంతచల్లని మనిషన్నా! చాలాసేపు గడిపినాము. ఆ లక్ష్మణు డేమిటి ఉత్త కొయ్య...

రావణుడు

ఆతనికి కేవలం అన్నావొదినలకు పరిచర్యచెయ్య డమూ, ఏవిధంగానూ వాళ్లకు గడ్డిపోచంతఅయినా

హాని కలగకుండా చూడడమూ తప్ప వేరే ఆలోచన లేదు. అందుచేత దక్షిణ దేశస్థులం మనవల్ల ఏహాని కలుగునో అని అనవసరపు జాగ్రత్త పడుతున్నాడు. అతనూ చాలా మంచివాడే. కాని మిథిలలో నేను సీత యెడల నా ప్రేమనుగురించి రామునితో చెప్పుతూ ఉండగా ఇతను విన్నాడు అదంతా. ఆనాటినుంచీ నన్నూ, నా వారినీ అనుమానిస్తున్నాడు. వివాహబంధంతో ప్రేమను ముడిపెట్టిక, ప్రేమతో ఆ అయోబంధాన్ని సహితం ఛేదించవచ్చునని ఆత డెరగడు. ఆర్యత్వంవినా అంగీక రించని అతను మన సంప్రదాయాలలోని ధర్మాలను గ్రహించలేడు. మన విధానాలు నిష్పాక్షిక హృదయంతో చూడలేడు.

శూ

మరి రాముడు ?

రావణుడు

అతని విశాలదృష్టి వేరు.

శూ

ఔనుకదూ, అబ్బా ఏమిమనిషి !

రావణుడు

ఇంతకూ నీసంగతి చెప్పు!

శూ

నే నక్కడ వున్నంతసేపూ చూశాను. రాముడు నాయందు ప్రసన్నుడే!

రావణుడు

నేను నమ్మను!

శూ

కాని నీవు అక్కడ వుంటే నమ్ముదువు.

రావణుడు

అయితే మళ్లీ వెడదాము రా!

శూ

ఇక నేను రాను. నా నోముఫలం పొందేమార్గం నేను వెతుకుకున్నాను. రాముడు ఒంటిగా లభించినప్పుడే దర్శించుతాను. కాని, నిన్ను చూడగానే ఒకగొప్ప ఆలోచన తోచింది.

రావణుడు

ఏమిటది?

శూ

నీవు ఒకవిధంగా వెర్రివాడవు. ఇన్నాళ్లూ నీ కెదురు లేని ప్రపంచంలో చరించావు. ఇప్పుడు వింతగా మారి చాపల్యం తెచ్చుకుంటున్నావు.

రావణుడు

నేను మారినమాట నిజమేకాని, అసలు చెప్పు, నీ ఆలోచన లేమిటి?

శూ

ఏమీ లేదు. స్త్రీలకూ పురుషులకూ ప్రేమజీవితంలో, అందులో విస్తారంగా స్త్రీలకు ఈర్ష్య హెచ్చు. ఎంత యెడబాటు సహించని ప్రియులకయినా మధ్య రవంత యీర్ష్యను ప్రవేశపెడితే, మరిగినపాలను పులుపువలె విరిచివేస్తుంది?

రావణుడు

ఔను.

శూ

సరేకదా. అయితే నీవు సీతను ప్రేమించావు, నాకు రామునిమీద మహాసక్తుపగా ఉన్నది.

రావణుడు

అయితే?

శూ

అందుచేత ఒక్కమార్గం వున్నది, మన కిద్దరికీ అనుకూలించేది. నీవు ఎన్నివిధాలా సీతను ఉన్ముఖం చేసికోలేకపోయినావు. కాని నాకు రాముడు ప్రసన్నుడే!

రావణుడు

నమ్మలేనంత వింతగా ఉన్నది.

శూ

ప్రేమ, ఆలోచనలకు లొంగేదికాదు. ఈ విశేషాలను అన్వయం చేసేది హృదయంకాని మేధస్సు కాదు. రాముణ్ణి నీవు గ్రహించలేవు. నేను చెప్పినట్టు విను.

రావణుడు

[ఆలోచనగా]

సరే, చెప్పు!

శూ

నేను రాముణ్ణి దూరంగా తీసి, సీతకు ఈర్ష్య కలిగించుతాను; ఆసమయం నీకు వార్త చేస్తారు. నీవు ఏ యితరఆలోచనా లేకుండా సీతను లంకకు తరిలించు.

రావణుడు

లాభం లేదు. నీవు చాలా పొరబాటుపడుతున్నావు.

శూ

ఇది ఒక్కటే మార్గం. ఇదివినా మరొకటి లేదు. నీవు స్త్రీస్వభావాన్ని ఎరగవు. నేను చెప్పినట్లు జరిగించు. సీత చాలా బాధలుపడుతున్నది రామునితో. అడవులూ నదులూ, కొండలూ ఎంత ఆకర్షిస్తూవున్నా ఆమెకు ఒక్కొక్కప్పుడు, ఈ రాముడూ ఇతని వింత ఆసలూ బాధగానే ఉంటూవున్నవి. నేను పొంచి విన్నాను, సీత అంటూన్నది: మనం ఇట్లా ప్రేమజీవితం గడుపుదాము, ఇంక ప్రజలూ బాధలూ వొద్దని. రాముడు ఒక దీర్ఘోపన్యాసం ఇచ్చాడు. తానేమో ఈసీత అమృతప్రవాహంలో కొట్టుకుపోతూవుంటే ఎక్కడనుంచో ఒక వేలు వచ్చి 'జాగ్రత్త! నీవు నీ ఆశయానికి దూర మౌతావు,

నీ ఆశయాలను సాధించడానికి సృష్టికల్పించిన ఒకశక్తి సీత, నీకు ప్రేమ పొరలు కప్పుతూఉన్నది. జాగ్రత్త!' అంటుందట ఆ వేలు.

రావణుడు

[ఆతృతతో]

సరే, సీత యే మన్నది?

శూ

సీత ఏమీ అనలేదు. అతనిఉపన్యాసం ఇంకా పూర్తి కాలేదు. ఉపన్యాసం ముగింపులో అన్నాడు: 'సీతా నీకు జీవితంలో ప్రేమ ప్రధానమైతే భౌతిక జీవితం అనుభవించడములో అద్వితీయుడూ, తన సమస్తం అర్పించి నిన్నే సర్వస్వంగా ఎంచుకునే రావణుడే నీకు తగినవాడు...

రావణుడు

[తొందరగా]

శూ, ఇది నిజమే, నిజమేనా?

శూ

దీనిలో ఒక్క మాట నాది లేదు. అందుచేతనే ఇంత ధైర్యంగా చెప్పుతున్నాను.

రావణుడు

కాని శూ, సీత ఏమన్నది?

శూ

ఆమె జవాబు చెప్పేటంతలో నీవు 'సీతారామా' అని కేక వేశావు.

రావణుడు

ఇదంతా నేను వచ్చేముందేనా? అయ్యో సీత జవాబు చెప్పకుండా దురదృష్టంగా వచ్చాను. ఆజవాబులో నాజీవితంభవిష్యత్తంతా ఇమిడి వుండును. ఎంత... [నిట్టూరుస్తాడు.]

శూ

జవాబు వచ్చినట్టే!

రావణుడు

ఏమిటి, ఏమిటి, ఏ మని?

శూ

'ఈగంభీరస్వరం ఎవ్వరిది?' అన్నాడు రాముడు. సీత వెంటనే 'రావణునిది' అన్నది.

రావణుడు

[ఆనందంతో]

నిజము, శూ, నిజమేనా? నాకు వాళ్ళు తెలియుడము లేదు. నిజమేనా శూ?

[పక్కనున్న చెట్టుమీదికి పొరుగుతాడు]

శూ

విను, ఇప్పుడు సొమ్మసిల్లడము కాదు.

[భుజంమీద చేయివేసి]

నాకు ఆశ పూర్తిగా కలిగినది అప్పుడే. సీతది చాలా గభీరమైన హృదయం, ఆలోతులో నీ వున్నావు. మగవాళ్లకే వివాహం పవిత్రమైనబంధం అనే పాడు పాటింపు. స్త్రీ పొంగేప్రేమ ఎక్కడవుంటే అటు వాలుతుంది. సీత, ప్రజలకోసమూ, వివాహబంధానికీ, స్వచ్ఛమైన ప్రేమను తిరస్కరించదు, ఆ రాముడు చెంతనుండక పోతే. ఆమెను నీవు విడదీసి లంకలో ఉంచి,

నీప్రేమ నంతా చూపి, సర్వం మరిపించగలిగితే ఆమె నిన్ను గ్రహించుతుంది. నిశ్చయం. ఒంటిగా ఉన్నా రాముణ్ణి నేను లభ్యంచేసుకుంటాను. ఇంతకన్నా మార్గంలేదు.

రావణుడు

[దీర్ఘంగా ఆలోచించి]

నాకు మహా కలవరంగా ఉన్నది.

నీవు చెప్పినదంతా ఆకర్షిస్తూన్నది. కాని, అంత చలనంలేని మనుష్యులే, మేరువులే, వాళ్లలో ఇంతటి మార్పు కలుగుతుందా అని ఇంకా సంశయంగా వున్నది.

శూ

అన్నా! ఇది ఆలోచలనకు తెమలదు. నేను చెప్పు తున్నా విను. ఈ సమస్య, తెంపుతో ఉద్రేకంతో, హృదయం కల్పించే ఆవేగంతోనే కాని, బుద్ధితో ఆలోచనతో కాదు. కలకాలం ఇలా సీత, సీత, సీత, అంటూ కలవరిస్తూ, నీరసిస్తూ, రాజ్యం సమస్తం విడిచి ఇట్లా శల్యం కాకపోతే, ఒక్క యత్నంలో ఆమెను సంపాదించుకొనేందుకే ఎందుకు దూకవు? ఎందుకు ఈ నీరసం?

ఇక ఆలోచన మాను; హృదయం సూటిగా ఎటు పొడిస్తే అటు కన్నులు మూసుకొని దూకు! సీతను నీ వశం చేసికో! స్త్రీ, ఇంతతీవ్రమైనప్రేమతో యాతనపడుతూ, సమస్తమూ అందుకు త్యజించినవానిని చూసి కరగక మానదు! మోడు కాదు, హృదయంగల స్త్రీ!!

రావణుడు

[గంభీరంగా]

శూ, ఇక ఆలోచనలేదు. కన్నులు మూసుకున్నాను. నీప్రోద్బలం అయస్కాంతములా ఆకర్షిస్తూవున్నది. బ్రతుకంతా ఒక్క జూదం ఆడివేస్తాను. ఇది నిర్ణయం. ఔను, ఆలోచనలేదు! ఆలోచన వీలులేదు...

సీతప్రేమో, సర్వనాశనమో! ఇక వేగేలేదు! జీవితం, నాహృదయం, ప్రపంచం, అంతా మారిపోతూ వున్నది...

ఇక ఆలోచన లేదు...

ఇది, మహాప్రణయమో, మహాప్రళయమో?

నాకు రెండూ వొక్కటే శూ!

నిర్ణయం! ఇక ఆలోచన వొద్దు! కన్నులు ఇక తెరవను! నాకు సీత, ఏనాటికీ సీత, అంతే! అందుకే సమస్తమూ, నిర్ణయం శూ, నిర్ణయం.

భయంకరమైన నిర్ణయం!

శూ

అన్నా, ఏమీ భయంలేదు. సర్వం శుభం.

రావణుడు

[కౌగిలించుకుని]

శూ, నీరుణం తీర్చలేను! నాకు ఎంత దారి చూపించినావు! నీకు కృతజ్ఞుణ్ణి!

శూ

ఎందుకు ఈవెర్రి. నేను వార్తచెయ్యగానే రా; మారీచునిమాత్రం వెంటనే నాకు సహాయం పంపు. ఇక సీత నీది. అశ్రద్ధ ...

రావణుడు

శూ! నిర్ణయం. వొళ్లంతా చెవులుగా వుంటాను నీ వార్తకోసం. వార్త చెవినిబడిన మరునిమిషం సీత లంకలో...

శూ

అదీ, నా అన్న ధీరత్వం! నేను పోతాను. రాముడు ఒంటరిగా విహారానికి కొండలవైపు వెళ్ళేసమయం. అన్నా, వుంటాను!

రావణుడు

శూ, జాగ్రత్త! నేను వెడతాను.
[నిష్క్రమణ]

[తెర, వడిదుడుకుగా]

# లంక

## 1

[అశోకవనం. అంతటా ముఖ్యంగా కనిపించేవన్నీ అశోకాలే. ఒక దానికి ఇంకొకటి కనబడకుండా వలయాలుగా దారులు పూపొదలతో పూవుటిక్కలతో ఏర్పాటు. ప్రతిమలు పువద్దా చెట్లతో లీనమై పోతూవున్న మరకతవేదులు. వనంమధ్యమాత్రం వలయం. దాని చుట్టూ తెలిపువ్వులపొదలు. మధ్యను ఒకటే అశోకం, ఆచెట్టు చుట్టూ మరకతవేది. ఆవేదిమీద సీత కూర్చుని ఉన్నది]

రావణుడు

[ప్రవేశించి, ఆందోళనతో]
సీతా!

సీత

[తలయెత్తి చూస్తుంది]

రావణుడు

సీతా !

సీత

రా! ఇలా రా ! కూర్చో !

[రావణుడు కూర్చున్నాడు. ఏమీ మాట్లాడలేనిస్థితిలో ఉన్నాడు]

సీత

ఎందుకు అంత తొందరపడ్డావు ? అంత తుఫానులా అయిపోయి ఎందుకు నన్ను తీసుకువచ్చావు ? ... దీనిపర్యవసానం ఎంచుకున్నావా ?

రావణుడు

ఎంచుకున్నాను ... యుద్ధం... రావణసంహారణ... శ్రీరామజయం...

నేను నిన్ను చూసింది మొదలు నీకోసము పరితపించాను. నాటినుంచీ నీవు నా నీరస మైనావు. జీవితంలోని ఉత్సాహమూ బలమూ సడిలి, బ్రతుకంతా నీ వే వాంఛగా మారినది. నిన్ను పొందడానికని కుమిలి కుమిలి, నిన్నపహరించాను. రాముడు ఇది గ్రహించడు. గ్రహిం

చినా నీకోసమూ, ప్రజలకోసమూ, దాడి వస్తాడు. నా హృదయదౌర్బల్యంతో నా ప్రేమతో నేను మరణిస్తాను.

సీతకోసం రాముని చేతిలో, మరణం! నాకు అంతే చాలు అప్పుడైనా నీవు గ్రహించుతావు...

ఈ స్థితి దాటి, నీ కనుచూపులో లేకుండా బ్రతుకు ఎందుకు సీతా ? నీవు చూస్తూండగా, నీ కోసం, భస్మమై పోతాను... చాలు !

సీత

ముందు ముందు నీ కెంత అపఖ్యాతి కలుగుతుందో ఆలోచించుకున్నావా ?

రావణుడు

ఆలోచించుకున్నాను. నాకు తెలుసు; చరిత్రలో నన్ను క్రూరరాక్షసుణ్ణిగా, భయంకరంగా, నిరూపిస్తారు. దుర్మార్గపువృత్తితో, నీచమైన కోర్కెతో, వారు పవిత్రంగా యెంచే మీ వివాహబంధాన్ని పాటించక నిన్ను ఎత్తుకుపోయినా నంటారు;

కాని ఎరగరు, నిన్ను సందర్శించిన క్షణంనుంచీ స్త్రీజాతి నాదృష్టికి ఒక కొత్తవికసన ఇచ్చింది అని.

కాలాంతం ప్రజాదూషణకు నన్ను గురిగా నిలువుతారు. నానీతి గ్రహించరు...

అయినా సరే, అలాగయినా సీతారాములతో నా పేరూ కలిసిఉంటుంది. పోనీ, దుర్మార్గుడనై అయినా మీకు నిరంతరమూ ఖ్యాతిని కూరుస్తూ మీకథలో ఉంటాను. నీ పేరుతో నా పేరూ కలిపి కలకాలం పలుకుతూ వుంటారు. నాకు ఆ తృప్తిఅయినా చాలును!

[దుఃఖంగా]

సీతా, నాహృదయాన్ని ఈపాటికైనా గ్రహించావా?

సీత

ఏమీ ఎందుకు గ్రహించలేను? ఈ నాడేమి, నిన్ను ఎప్పుడూ సరిగ్గానే అర్థం చేసుకుంట్నునాము కాని...

రావణుడు

సీతా, ప్రేమ ఉన్మత్తుణ్ణి చేసివేస్తూఉన్నది నన్ను.

సీత

కాని ఇంత తెంపరితనంతో వృథాగా...

రావణుడు

నీవు లేనిదే జీవించలేను అనుకున్నాను. మరణం ఆకర్షణ ప్రారంభమయింది. అందుచేత కన్నులు మూసుకుని అన్నిటికీ తెగింపుచేసుకున్నాను.

సీత

ఎందుకు...

రావణుడు

ఏమి చెయ్యను సీతా ? నేనెంత దహించుకుపోతున్నానో గ్రహించలేవూ ?

సీత

[తల ఊపుతుంది]

రావణుడు

నేను, ఈ జీవితంలో ఎంత కాల్చుకుపోయాను; నా హృదయశాంతికోసం ఎంత తల్లడిల్లిపోయాను; సీతా ! ప్రపంచమంతా అన్వేషించాను...

ఇంత చల్లని శీకరమైనా తగలలేదు. ఎన్ని సౌందర్యాలను స్వాధీనపరుచుకున్నాను. కాని ఏ సౌందర్యమైనా ఒక్క త్రుటిమాత్రమే కన్నులు మిరుమిట్లుగొలిపేది.

మళ్లీ బ్రతుకంతా అంధకారమైపోయేది. ఎందుకు నన్ను నేను బయటపెట్టుకున్నానా, అని పరితపించేవాడిని. ఈ తళుకులూ ఈ తమాషాలూ కావు నా వేదనకు తృప్తి అని తెలుసుకున్నాను.

సీత

రావణా !

రావణుడు

సీతా, నామీద జాలిగా లేదూ?

[ సీత నిట్టూరుస్తుంది ]

సీతా, నీకు బాధగా ఉన్నానా? నీకు అపచారం చేస్తున్నానా?

సీత

[బాధగా]

కాదు, ఎందుకు ఇంత తొందరపడ్డావు?

రావణుడు

ఇక భరించలేకపోయాను. ఈవిధంగా ఎంతకాలమో భరించలే ననుకున్నాను. నిన్ను పొందడాని కని

నా బ్రతుకూ, నా కీర్తీ, నా రాజ్యం, నా సమస్తం బూదమాడివేయవలె ననిపించింది. సీతా! నా కేమీ తెలియడం లేదు. నీవు నాకు అర్థంకావడంలేదు. అంతా అయోమయంగా ఉన్నది.

సీత

ఎందుకు ఇంతజాలిగా అయిపోతున్నావు?

రావణుడు

సీతా, నీహృదయం విప్పవూ? నన్ను గ్రహించవూ?

సీత

రాముడు ఎంత బాధపడతాడో ఆలోచించావా?

రావణుడు

[ఎంతో బాధతో]

అబ్బా, ఏమి చెయ్యను సీతా? ...... మొన్న పంచవటిలో మిమ్మల్ని చూశాను. నీవు నన్నెంత ఆదరించావు! అబ్బా, రాముడు ఎంత ఆదరించాడు!...... మీ ఆతిథ్యం, ఆనందం, మీ అపూర్వప్రేమా, నన్నెంత ఆకర్షించినవి. ఆ సందర్శనం చాలు ననుకున్నాను. నిర్మల ప్రేమస్వరూపం దర్శించాను అనుకుని,

ఆ పటం గుండెల్లో దాచుకుని, అట్లాగే లంకకు బయలుదేరాను, కోర్కెలన్నీ జీవితంలో రద్దుచేసుకుని. నా బ్రతుకు ముందుకు చూసుకుంటే అంతా శూన్యంగా, నిస్తేజంగా, మొడతెగని బాటగా కనిపించింది. ప్రపంచంలో ఉన్న విలువ అంతా నాగుండెలలో ఉన్న పటంలోనికే చేరుకున్నది. ఇది కదేపదే చూసుకుంటూ జీవితమంతా గడుపుతే చాలుననే దృఢనిశ్చయంతో లంకముఖం పట్టాను.

సీత

అప్పుడు?

రావణుడు

అప్పుడు, మాచెల్లి కనిపించింది. కనిపించి నాహృదయంలోని పటం లాగివేసింది; నా దారి మళ్ళించింది. నీమాటలు విన్నదట. నీ హృదయంలోతులో నేను ఉన్నానన్నది.

నేను పూర్తిగా మారిపోయాను. నాకు స్వార్థపరత్వం కలిగింది. మళ్లీ బ్రతుకులో మంట లేచింది. ఇక ఆగలేకపోయినాను. కన్నులు మూసుకుని ఒక్క వేదనతో నిర్ణయం చేసుకున్నాను:

బ్రతుకుతే నీతోనే, లేకపోతే మరణించడం నీకోసమే. ఇప్పటికీ నీవు గ్రహించకపోతే, ఇక వాళ్ళు తెలియని దూకుడులో నా సమస్తాన్నీ ప్రణయనటరాజమూర్తి పాదాల క్రింద జేర్చి, సీతను జపించుకుంటూ భస్మీభూతమైపోతాను. అప్పుడైనా ఆదేవి ఆభస్మం ఒకచిటిక తీసి నొసటను పెట్టుకోదా?...

సీత

[చాలాసేపు ఆగి]

అబ్బా, ఎంత తెంపరిహృదయాలు మీవి!

రావణుడు

[సీతకన్నులలో కన్నులుపెట్టి చూస్తాడు, ఆతృతతో]

సీత

[ఎక్కడనో ఆలోచనలో]

పాపం, మీచెల్లి ఎంత పరాభవం ఓర్చింది!

రావణుడు

సీతా, ఈ ప్రణయజీవనానికి పరాభవంలేదు. ఇవి పరాభవాలు కావు. నీవు ఎరగవూ?

సీత

రావణా, ఇట్లా చూడు!

[రావణునికళ్ళలోలోపలకు చూస్తుంది. రావణుడు ఆచూపుతో వెర్రిగా అయిపోతాడు]

ఎందుకు నీ హృదయం నేను గ్రహించలేదు అనుకుంటావు?

[రావణుడు తెలియకుండానే ముందుకు జరుగుతాడు]

ప్రేమ నిజస్వరూపం గ్రహించు! చూడు....
నీకు ప్రేమ దారిచూపింది;
ధన్యుడివి!

రావణుడు

[ఆప్యాయంగా]

సీతా!

సీత

[మెల్లిగా]

నీవు చెప్పినది సత్యం. ప్రేమకు పరాభవాలు లేవు.
ప్రేమ కష్టదాయిని!
ప్రేమ నటరాజమూర్తి!

[నిశ్వసిస్తూ అర్థానికిఅందనిచూపు చూస్తుంది]

రావణుడు

[దీర్ఘంగా ఊపిరించి, తల వొంచుకుని, లోపలనుంచి పలుకుతూన్నట్టు]

సీతా, నీ వింతకన్నులకైపు తగిలిననాటినుంచీ ఈ జీవితం ఒకవెర్రిఆవేశనగా అయిపోయింది. బాధలో సుఖం అనగాహాన అయింది.

సుఖాన్నేగాని యెరగని రావణుడు దుఃఖాన్నే అన్వేషించడం నేర్చుకున్నాడు; దుఃఖంలోని గాంభీర్యాన్నీ, లోతునూ, నీ వరంగా పొందుతున్నాడు!

సీతా, ఈనాటి ఈజీవితం ధన్యం! ఇంక బ్రతకను సీతా! ఈస్థితి దాటి బ్రతుకు వొద్దు.

సీత

[వొణుకుతూవున్న కంఠంతో, అతిజాలిగా]

రావణా!

రావణుడు

[తలయెత్తి చూస్తాడు. అతనిచూపు సీతకన్నులతో అతుక్కునిపోయినట్టు అయిపోతుంది]

[శాస్త్రిగా]

సీతా, సీతా, సీతా! ఆ కన్నులు నావి కాకుంటే జీవించలేను. సీతా! ఏమి సృష్టిరహస్యాల విప్పులు, ఏమి వెలుగులు నీకన్నులలో, చంద్రికాశీతల నటనలా, గుండెను పూడ్చివేసే ఉగ్రప్రణయజ్వాలలా? హాలహలమా, అమృతమా, ఆచూపులు? సీతా, నీయిష్టంవచ్చినట్టు నడిపించు! నీ దానిసను......

సీత

కలతలేని కామంకన్నులు విప్పు రావణా! నన్ను పూర్తిగా గ్రహించు!

రావణుడు

సీతా! గ్రహింపునకుఅందని మార్పు ఏదో కలుగుతూంది నాలో. అబ్బా, నీకన్నులు! ఎన్నిప్రణయప్రపంచాలు గులాబీచిచ్చులతో మరుగుతూఉన్నవి నీకళ్లలో! ఎన్నివాంఛలు దగ్ధమై మరిగిపోతూన్నవి ఆ మంటలలో!

ఏమి ప్రణయతాండవం!

సీతా! నీలో ఈరావణుడు ఇక దగ్ధమైపోనీ!

సీతా! నీ కన్నులలోనుంచి నా కన్నులు...తప్పించనూ లేను...అర్పించనూ లేను...

[కన్నులు మూసుకోబోతాడు. సీత రావణునిచేతులకు తనచెయ్యి అడ్డు పెట్టబోతుంది. రావణునిచేతులు క్రిందకు దిగిపోతవి]

సీత

కలతపడక గ్రహించు రావణా! నిర్మలమైన మనస్సుతో నిశ్చలమైనదృష్టికి అవగాహనకానీ సత్యాన్ని!

రావణుడు

ఏమిటి సీతా?

సీత

అంగీకరించగలవా స్త్రీహృదయంలోని విశ్వప్రణయాన్ని? ఏ పురుషుడైనా అంగీకరించగలడా?

రావణుడు

ఏమిటి సీతా?

సీత

రావణా సృష్టిరహస్యం నీవు గ్రహించి అంగీకరించుతే ఇప్పటి నీదృష్టి తారుమారు అయిపోతుందేమో?

రావణుడు

[ఆందోళనతో]

సీతా! నాకు నూతనతేజోమార్గాన్ని విప్పుతున్నావా? సీతా, నన్ను నడిపిస్తావా ఆదారిని?...

[ధీరంగా]

రావణా, స్వార్థ మెరగని ప్రేమ పురుషులకు ఊహాతీత మేమో? కావలెననే కోర్కెలేని ప్రేమ మగహృదయం ఎరగదు.

స్త్రీసృష్టి వేరు. స్త్రీ ఇచ్చివేసే ప్రేమనే ఎక్కువ ఎరుగును. కావలెననే ప్రేమవాంఛ ఆమెకు తక్కువ. మాతృత్వంలో రహస్యమే ఈ వింతప్రకృతికి కారణమేమో!

ప్రేమించిన ప్రేమకు ఆదరణచూపని స్త్రీహృదయం ఉండదు. అది ప్రేమించిన మగగుండెలకు ఈర్ష్యాకారణం కూడా. పురుషుడు స్త్రీలోని ఈ విశ్వసందర్శనానికి ఆగలేడు. ఈవైశాల్యంలో ఆ చిన్నబుచ్చుకోదగిన జేనెడుస్వార్థం నింద్య మౌతుంది.

[రావణుడు సీతను కౄరిగా చూస్తూ నిట్టూరుస్తాడు]

రావణా! కోర్కెవీడి ఈ ప్రణయప్రపంచంలోనికి రాగలవా?

ఈ శరీరంఅంచులుదాటిన ప్రణయంలో రాముడా, రావణుడా, అనేప్రశ్న ఉంటుందా? రావణా, కదులు! ఇది గ్రహించు...

రావణుడు

[గాఢంగా కన్నులు మూసుకుని]

సీతా ! ...... మారుతూవుంది నాలోపలి సమస్తమూ...నా మెదడు గ్రహించలేనిపరివర్తనంలో పడిపోతూవుంది...

సీత

రావణా, ఇటు చూడు !

రావణుడు

నీ కన్నులమత్తుచూపు నాగుండెలలో ...... సీతా, సీతా, సీతా ! నీ యిచ్ఛలో, నీ నిర్మాణంలో, ఇంకొక రావణుడు అయిపోతున్నాడు ......సరే సీతా, నీ యిష్టం...

సీత

ఇటు చూడు, రావణా !

రావణుడు

[తెరిగా]

చూడ లేను సీతా ! చూడ లేను. నీ చూపుస్పర్శల ఆకర్షణకు ఈశరీరాన్ని ఆపలేను; అర్పించనూ లేను.

[సీత రావణునిచేతులు కళ్లనుంచి తీస్తుంది]

రావణుడు

[చలించిపోతూ కన్నులు తెరిచి, వెర్రిగా, బిగ్గరగా]

సీతా, నీ రావణుడు............ ..........

[ఒక్క ఊగు ఊగి ఆమె చేతులలో శిరస్సు పడి, పెద్దగా పొంగుతూ క్రిందకు ఒరిగిపోతాడు. రావణుని శిరస్సు ఆమె పాదాలమీదకు జారుతుంది. సీత శాంతంగా రావణుని శిరస్సు తనతొడమీద పెట్టుకుంటుంది]

రావణుడు

[కొంతసేపైనతరువాత మూర్ఛలో]

సీతా!

[కన్నులలోనుంచి నీళ్లు కాల్వలుగా కారుతూంటవి, సీతకన్నులలో నుంచి రెండుఅశ్రువులు రావణునికన్నులలో పడతవి]

రావణుడు

[ఇంకా మూర్ఛలో]

సీ... తా... !

సీత

[విశ్వమంత నిట్టూర్చి, డగ్గుత్తికతో]

రావణా!

[తెర, గంభీరంగా]

## 2

ప్రొదయం. లంకాపురం పచ్చతోరణాలతో, పూలదండలతో, పూసిన పాలగచ్చులతో, ఉత్సవంగా ఉన్నది, పురసౌధాలమీద జయపతాకలు అలసంగా కదులుతూ. జయధ్వానంగాని కోలాహలం గాని ఎక్కడాలేదు.

నిశ్శబ్దం.

ఊరిబయట - రణరంగవామోప్యం.

దావాగ్నిలా పెద్ద మంటలులేస్తూ ఒకగుండం కాలూవున్నది.
రాముడు మంటకు దూరంగా దీనంగా ఆందోళనగా ఉన్నాడు.
లక్ష్మణుడు రామునికి ఎడంగా కన్నీరుగా ఉన్నాడు.
హనుమంతుడు దిక్కు మొహం.

ఎవ్వరూ మాట్లాడలేని స్థితి.

అగ్నిహోత్రుడుమాత్రం తీవ్రంగా జిహ్వాలు చాపుతూ విజృంభి స్తున్నాడు. లంకాపురవాసులు బొమ్మలవలె చాలాదూరాన నిలిచి చూస్తున్నారు, గుండెలు కొట్టుకుంటూ. అశోకవనం ప్రాంతంనుంచి సీత వొస్తూవున్నది. ముందు విభీషణుడు తలవొంచుకుని ఎదోబరువుతో భూమిలోనికి కుంగిపోతూన్నట్టు నడుస్తున్నాడు.

సీతవదనంలో సూర్యచంద్రులలో లేని ఒకవింతకాంతి విశదంగా ఉన్నది. ఆమెకన్నులలో గొప్పగాంభీర్యం, నిర్మలత, శాంతి; అడుగులలో ధైర్యం, స్థైర్యం, ఆత్మతో పరికించుతే భూతలాన్ని పవిత్రీభూతం చేయడానికి అవతరించినటున్నది.

సీత పైటచెంగు గోళ్లతో సవరిస్తూ అగ్నిహోత్రందగ్గరగా నిలిచిన రామునికి ఎడంగా ఆగి, మంటలు చూస్తూ నిలుస్తుంది.

[కొంచెముసేపు భీకర నిశ్శబ్దం]

సీత

లక్ష్మణా, నా పవిత్రతను వ్యక్తపరచడానికి అగ్నిపరీక్షను కోరుకోవడమే కాదు, అగ్నిలో ఆహుతికమ్మన్నా నేను సిద్ధమే!

రాముడు

[తలవంచి]

సీతా! ఈ కష్టపరంపరలకు నాకు దుఃఖము లేకపోలేదని నీకు తెలుసును. రావణసంహరణకు పూనుకోవడముకూడా విధిగా ఎంచికాని, నీ రామునిహృదయం నిర్మలమనీ, అందులో నీచఅభిప్రాయాలకు తావులేదనీ నీవు ఎరుగుదువు.

ఏ మహత్తరఆశయాన్ని ప్రజాదృష్టిలో స్థిరంగా నిల్పవలెనని ఆదిని సంకల్పించుకున్నానో ఆ ఆశయం కోసమే రావణసంహారణబాధ భరించాను......

సీతా, అందుకోసమే......

[రుద్ధకంఠంతో]

సీతా! .........

[సీత ఏవిధమైనచలనంలేని చూపు ఒక్కత్రుటి ఓరగా రాముణ్ణి చూస్తుంది]

రాముడు

[ధైర్యం తెచ్చుకుని]

సీతా, నీ రామునిహృదయంలో ద్వేషానికీ, సంశయానికీ చోటు లేదని నీకు తెలుసు...

సీత

[తల ఊపుతుంది]

రాముడు

ఏ ధర్మప్రతిష్ఠకోసము, ప్రజలకోసము, నిన్నసాయంత్రం రావణుని చితికి నిప్పుఅంటించినానో ఆ కార్యం నిమిత్తమే ఇప్పుడు......

[గద్గదికతో]

ఇప్పుడు ఈ కాష్ఠాలను రగిల్చాను. సీతా, నీ రాముడు నీకన్న ముందు అగ్నిలో ప్రవేశిస్తున్నాడు.

సీతా, నీతో నీ రాముడు పరీక్షలకు పాలవు తున్నాడు.

నీవు పడే బాధలకు ఈ హృదయం ఎంతో కుములుతూ వున్నది.

అవసానదశలో "ఇకనైనా సీతను సుఖపెట్టు రామా!" అని దీనంగా బ్రతిమాలిన రావణవాక్యం ఆరనిచిచ్చు రగిల్చి నా హృదయాన్ని దహించివేస్తూవున్నది.

సీత

రావణున్ని అర్థంచేసుకున్నావా ?

రాముడు

పూర్తిగా అర్థంచేసుకున్నాను. వీరుడు, త్యాగ మూర్తి ఆతన్ని అర్థంచేసుకోగలగడం చాలాకష్టమే! అవసానదశలో మూర్ఛలో, "సీతా, సీతా, ప్రణయ తాండవం!" అంటూ నీపేరే జపించాడు.

సీత

స్మృతివచ్చి మాట్లాడినాడా ?

రాముడు

కొంత తెలివివచ్చినతరువాత, 'రామా, నాపైన ద్వేషమా, ఈర్ష్యా ?' అని ప్రశ్నించాడు. ఇది జిగీష కూడా కాదు, ఒకవిధికి కట్టుబడితప్ప, మనకు హృదయాలలో విరోధం వద్దు, అన్నాను.

[తలఎత్తి సీతను చూస్తాడు; సీత తల ఊపుతుంది, ఔను అన్నట్టు]

రాముడు

తనకీర్తి, తనరాజ్యం, తానూ ప్రేమార్పణమై ఆ ప్రేమఆదర్శ కోసం అట్లా నాచేతిలో నీకోసం నశించడమే తన ఆశయం అంటూ, అదే తన ఆశయానికి విజయం అంటూ,

[సీత నిట్టూరుస్తుంది]

నాతొడమీదఉన్న తన తలను యత్నించి కదిపి చేతులు రెండూ నామెడచుట్టూ కలిపి 'రామా జయం! జయం నీకా నాకా? కాదుసుమా. ఇది ప్రేమ విజయం! నేను ఓడిపోయి మరణించడంలేను; జయించి ముక్తి పొందుతున్నాను. ప్రేమ జయిస్తూవుంది! ప్రేమలో నేను

జయం పొందుతున్నాను. అశోకం, ఆనందం, సీత, సీత, సీత, అని నీ పేరే జపించుకుంటూ నిర్యాణమైనాడు.

మరణసమయంలో హృదయం విప్పి చెప్పి నాగుండెలు కదిలిపోయేటట్టుగా...

[తల వొంచి]

'సీతను ఇకనైనా సుఖపెట్టు, ప్రజలు అపనిందలు వేస్తారు. పాటించకు' అని దీనంగా వేడుకున్నాడు.

నేను అంతర్గతంగా దుఃఖంగా, కన్నీరుగా కరిగిపోయాను. ఎంత ఆదర్శప్రాయుడైన ప్రియుడు!

ఇంకా ఆరిపోకుండా, ఈమంటను చూస్తూ రగులుతూ ఉన్న రావణకాష్ఠం కనలుతూవున్న కన్నులతో 'ఇకనైనా సీతను సుఖపెట్టవా?' అనే మందలింపుతో నన్ను దహించివేస్తూఉన్నది.

సీతా! రావణుడు సజీవుడే అయివుంటే ఈ అగ్నిని తన కన్నీటితోనైనా ఆర్పేవాడు!

[తల ఎత్తి]

బ్రతికివున్నట్టయితే... ఈ అగ్నిపరీక్షకు చాలా బాధపడేవాడు.

సీత

[తల వొంచి]

ఔను, చాలా బాధపడేవాడు.

[అగ్నిలో ప్రవేశిస్తుంది. కాల్చడానికి దూకుతూవున్నట్టు కాకుండా అగ్ని, తనకు కలుగుతూఉన్న అపూర్వగౌరవాన్ని ఆనందంతో ఆహ్వానిస్తున్నట్టు చేయిచేతులు చాపుతుంది]

[తెర, ధీరంగా]

*

హత్య చేసుకున్న

ప్రాణస్నేహితుడు

మా

మొక్కపాటి రామమూర్తికి

అంకితం

*

రామ్మూర్తీ!

ప్రేమ, తీవ్రమైనతపస్సుగా ఎంచుకుని జీవించ యత్నించావు. నిర్మలమైన ప్రేమకు ఈర్ష్య లేదని నిరూపించినావు. ఏనాడు అటువంటిప్రేమకు మమకారంతో కూడిన ఈర్ష్య నీలో అడ్డుగా తోచిందో, ఆనాడు శరీరంలో కలిగిన నీరసాన్ని నిరసిస్తూ, ఆ పాడుకళేబరాన్ని 'వడకని కరముతో' తొలగించి నీ ప్రేమజ్యోతిని ప్రపంచానికి వెలిగించినావు.

నీవు చేసింది 'ఆత్మహత్య' కాదు - మహాత్యాగము! నీవు జీవించడమా, ప్రేమ జీవించడమా? అన్నసమస్యకు, 'జీవించవలసినది ప్రేమే!' అని, నీవు నిర్యాణమైనావు. ఈకృతికి నీవే భర్తవు.

తుప్పుపట్టిన ధర్మ(?) బంధాలకు కట్టుబడిన పాత సంఘమూ, నిండుసత్యం తేజస్సు భరించలేని నూతన సంఘాలూకూడా నిన్ను చూసి భయపడినవి. అంతే కాదు. నిన్ను ఒకరాక్షసునిగా నిరూపించినవి.

మొదట సంఘసంస్కారానికి నీతో చేయిచేయీ కలిపిన వారే నీకూ పది శిరస్సులు కల్పించి, నిన్ను భయంకరుణ్ణిగా చిత్రించుకున్నారు.

ప్రపంచమూ నిన్ను గ్రహించలేదు. పైగా నీ జీవితంలోని చినిచిన్ని భాగాలు తీసి అపార్థాలు కల్పించింది. నీవో, సర్వం ప్రేమమయం చేసుకుని, ప్రేమోన్మత్తుడవై, ప్రేమకై బ్రతుకు తపస్సుగా అర్పించి దహించుకుపోయావు.

నీ సత్యాన్ని సాధించావు!

ప్రేమ నటరాజమూర్తిఅయి తాండవిస్తే, ఆ ప్రళయానికి శిరస్సిచ్చి భస్మమైపోయావు! ఆ భస్మాన్నయినా ఒక్క చుక్క నొసటను బొట్టుపెట్టుకోడానికి జంకుతున్నారు ఇంకా.

నీకూ, ఈ కృతికీ, నాకూ ఒక బంధం ఉన్నది...
ఈ కృతి నీకే!

నీ

ముద్దుకృష్ణ

# సింహావలోకనం

రామాయణాన్ని కేవలం పూజాపదార్థంగా ఎంచి, చదవడంకూడా అవసరం కాదని, దేవుడిగదిలో పెట్టి, విగ్రహాలతోపాటు దానికీ ఒక నమస్కారం పడవేసి, మోక్షానికి ఒక మెట్టుగా భావించే మెదడు ప్రయోజనంలేని సనాతనులతో నాకు నిమిత్తం లేదు.

'సీతవంటి భార్య'అనీ, 'రామరాజ్యం'అనీ, వీటిని నిత్యలక్ష్యాలుగా చూసుకుంటూ ఆ ఆశయాలను దైనికజీవితంలో అనుసరించ యత్నించేవారూ, సీతారాముల జీవితచరిత్ర అర్థయుతమని ఎంచేవారూ ఎవరైనా ఉంటే వారికోసమే ఈ వ్రాత.

వీరిలో కొందరు ఈ కావ్యాన్నిగురించి చేయబోయే ముఖ్యఆక్షేపణలు మూడు:

1 'వాల్మీకి అంత అద్భుతంగా నిర్మించిన రామాయణాన్ని తోచినట్లుగా మార్చడమా?'అని,

2 'ఉత్కృష్ట ఆదర్శాలుగా ఏర్పడిపోయిన సీతారాముల జీవితాలకు ఈవిధంగా నూతనఅర్థకల్పన చేసే, నిర్ణయంగా ఒకదారిని యాత్రిస్తూఉన్న జాతిని వృథాగా ఆందోళనలో దించడం కాదా?' అని,

3 'ఎంతసానుభూతి ఉన్నా, తనను ప్రేమించిన పరపురుషునితో స్నేహంగా ప్రవర్తించడమూ, ఏ అవస్థలో ఉన్నప్పటికీ అతనిశిరస్సు తన తొడమీద పెట్టుకోవడమూ సీత పవిత్రతకు లోపం కాదా?' అని.

1 మొదటిఆక్షేపణకు జవాబు: కవి నిరంకుశుడు, ముఖ్యకథను మాత్రం అనుసరించి, ఆ కథకు అర్థాన్ని కల్పించడంలోనూ, కథప్రయోజనాన్ని ఎంచడంలోనూ, సంపూర్ణస్వాతంత్ర్యాన్ని తీసికోగలడు.

వాల్మీకి మహాకవే, ఆయన కళాసంపత్తి ఉత్కృష్టమైనదే! కాని, అంత మాత్రాన రామాయణాన్ని విమర్శించడమూ, ఆయనసృష్టికి భిన్నంగా యత్నించడమూ తగాదా కాదు. ఆ కాలానికి ఉత్తమంగా కనిపించిన ఆశయాలను కథలో చొప్పించి, ఆ కథలోని వ్యక్తుల జీవితాలు ఆదర్శప్రాయంగా ఒప్పించడంలో వాల్మీకికి ఎంతహక్కో ఏ కవికయినా అంతహక్కూ ఉన్నది.

ఇంతకూ, రామాయణం ఆసేతుహిమాచలం ప్రజాదరణ పొందడానికి కవిత్వం, కళ, ధర్మం, చరిత్రాత్మకమైన ఇతరవిషయాలూ కాక రెండు విశేషాలుకూడా ఉన్నవి. ముందుగా వీటిని విమర్శిస్తాను.

1 సుందరకాండలో మోక్షసాధకమైన బీజాక్షరాలు ఉన్నవని:

దీనిని అంగీకరించినవారు రామాయణంలోని కళాకవిత్వధర్మాదులతో నిమిత్తం లేకుండా సుందరకాండను మంత్రశాస్త్రంలో జమకట్టితే తేలికైనపనే. కాని, ఆ కారణంవల్లమాత్రమే రామాయణం పొందుతూన్న ఉత్తమతకు అర్థం కానేరదు.

2 రాముని పుట్టుకకు పూర్వమే ఈ కృతి పుట్టినదని:

వాల్మీకి పరువు హెచ్చిస్తున్నాము అనుకుని ఆయనకు ఇటువంటి అపవాదు కల్పించిన దురదృష్టవంతులకే ఈ అపఖ్యాతిని వొదిలివేస్తే ఆదికవికి న్యాయంచేసినవాడను ఔతాను. ఎందుచేత నంటే :

ఒకందుకు వ్రాసినకథ అయినప్పటికీ దానిలో ఉత్తమలక్ష్యాలు చూపి, ధర్మాధర్మనిర్ణయం చేయను యత్నించి, అద్భుతకల్పనలతోనూ కమ్మని కవిత్వపోకడలతోనూ కథను పోషించి, రామాయణాన్ని నిర్మించడములో వాల్మీకి మేధాసంపత్తి గోచరిస్తుంది. రామాయణం రామునికి పూర్వమే కల్పితమైనకథ అయినట్లయితే, అంతటిమహాకవీ, అంతటి కళాశీలీ, అంత మేధావీ అయిన వాల్మీకి నిర్మాణంలో లోపాలున్న నాయకుడు సృష్టికావలసిన అవసరం కానరాదు.

వాల్మీకి పరువుసంగతి విడిచి పై అభిప్రాయాన్ని ఆలోచించవలె నంటే, సందర్భానికి కొంతవరకు సరిపోయే ఒకజవాబు చెబుతాను.

ఇంగ్లండులో ఒక కథకుడు నవల వ్రాశాడు. కొంత కాలమైన తర వాత ఆ నవలను ఒక ఫ్రెంచిస్త్రీ చదవడం తటస్థించినది. ప్రతిపుటలోనూ తనజీవితమే తూచా తప్పకుండా ప్రతిబింబితమైనది, తన వర్తమానస్థితివరకూ ఆ కథ అన్నిటా సరిపోయింది. మిగతాకథను అతి ఆత్రుతతో ముగించివేసింది. ఆనాడు మొదలు ఆమెజీవితం ఆ నవలలో విధంగానే అయిపోయి, ఆ నవలలో తీర్పువలెనే దారుణంగా ముగిసింది. ఆ నవల తనకు ప్రాణాంతకమైనది అని ఆమె చనిపోయేముందు తెలిపింది.

రామాయణరచన ముందై, రాముడు తరవాతనే అయితే, బొత్తిగా మెదడు మెత్తనై కల్పితకథచేతులలో కీలుబొమ్మ అయిపోయిన ఆ ఫ్రెంచి దురదృష్టవంతురాలివలె, వాల్మీకిరామాయణాన్ని చదివిన ఒకరాజకుమారుడు ఎవరో ఆవిధంగా అయిపోయినాడు అనవలసి

వుంటుంది. ఇది రాముణ్ణి గౌరవించేవారికి ప్రయోజనకారి కాదు. అందుచేత మూఢనమ్మకాలను వొదిలి- హేతువాదానికి తావిచ్చి, 

వాల్మీకిరామాయణంలోని కొన్ని సందర్భాలనుబట్టి నిష్పాక్షికంగా ఆలోచిస్తే:

రావణుడు ఈనాటికీ అందరూ అనుకుంటూవున్నట్లు దురాత్ముడూ రాక్షసుడూ కాదు, సరే గదా చాలా పెద్దమనిషిగాకూడా కనబడతాడు. అయితే పరదారను, సీతను ఎందుకు అపహరించవలెను? అన్న ప్రశ్న అంకురిస్తుంది.

రాక్షసధర్మాన్ని అనుసరించి ఏవిధంగానూ ఆనాటికి అది తప్పు కాదు. రావణుడు సీతతో అంటాడు:

> స్వధర్మో రక్షసాం భీరు, సర్వథైవ న సంశయః
> గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా
>
> సుందరకాండ 20 సర్గ. 5 శ్లో

'పిరికిదానా, ఇతరుల స్త్రీలను ఎత్తుకుపోవడము రక్షసులకు స్వధర్మము. ఏసందేహమూ లేదు' అని. దీనినిబట్టి న్యాయం ఆలోచించవలసి వుంటుంది. ఈనాటి సాంఘికధర్మాలనుబట్టి ఆనాటి సందర్భాలను నిర్ణయించడం ధర్మంకాదు. ఇప్పటి పీనల్ కోడ్‌ను బట్టి విచారణ చేస్తే, మైనరుపిల్లను తండ్రి సంరక్షణనుంచి ఎత్తుకుపోయినందుకు 361 సెక్షను ప్రకారం కృష్ణుడికి 7 సంవత్సరాలు కఠినదండం పడవలసివుంటుంది. ప్రేమించిన పిల్లను ఇంటినుండి లేవదీసినా లేవరయినా రుక్మిణీపరిణయంకేసును డిఫెన్సువాదనములో చెపితే జడ్జీలు నవ్వుతారుకదా! ఈవిధంగానే ఆలోచిస్తే, కుంతీ ద్రౌపదుల పాతివ్ర

త్యమూ, భారతంలోని చాలామంది మహానుభావుల పుట్టుకలూ గౌరవించదగినవి కావు.

అందుచేత ఏసంఘాన్ని గురించి ఆలోచిస్తున్నామో ఆనాటిసంఘ ధర్మాలను సూత్రాలుగా రూపొంచి ఆలోచించడం న్యాయమౌతుంది. ఈన్యాయాన్ని అంగీకరించి రావణునిచర్య విచారణ చేస్తాను :

సీతవి కైపుఎక్కించేకన్నులు. రావణుడు సీతయెడల ప్రేమోన్మత్తుడు. ప్రేమించిన స్త్రీని పొందడము రాక్షసులకు ఏవిధంగానూ తప్పుకాదు. అందుచేత సీతను అపహరించాడు. నీచమైనకోర్కెతో కాదు. ఎందుచేత నంటే, సీతను తాను ప్రేమించి, గౌరవించకపోయినట్టయితే, ఆమె లంకలో నిస్సహాయగా తనస్వాధీనంలో ఉన్నప్పుడు ఆమెను అంతగౌరవంగా ఆదరించడమూ, ఆమెయెడల ఏవిధమైన అపచారమూ జరగకుండా జాగ్రత్తగా చూడడమూ, ఆమెను దర్శించినప్పుడు ఏదౌర్జన్యమూ ఎంచకుండా మర్యాదగా సుముఖం చేసికో యత్నించడమూ సమర్థించ వీలులేదు. ఇందుకు తార్కాణలు వాల్మీకి రామాయణం సుందరకాండ 20వ సర్గలోనుంచి చూపుతాను: అశోకవనంలో సీతను దర్శించినప్పుడు రావణుడు- "కామయే త్వాం విశాలాక్షి-" 'విశాలమైనకన్నులు గలదానా, నిన్ను ప్రేమిస్తున్నాను,' అన్నాడు. అంతప్రేమతో ఉన్నవాడు తనస్వాధీనంలో నిస్సహాయగాఉన్న ఆమెయెడల చేసిన దౌర్జన్యం ఏమైనా ఉన్నదా చూడండి:—

"ఏవం చైత దకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి
కామం కామ శ్శరీరే మే యథా కామం ప్రవర్తతామ్"

'సీతా! మన్మథుడు నాశరీరంలో ఇచ్ఛవచ్చినట్లు చరించనీ, అయినప్పటికీ కోరికలేని నిన్ను నేను ముట్టుకోనైనా ముట్టుకోను' అని అతిన్యాయంగా ప్రవర్తించాడు. ఇంతే కాదు. కేవలం శారీరకసుఖాన్ని ఇచ్చి కామించినంతమాత్రానకూడా చాలదు 'భవ మైథిలి భార్యా మే' 'నీవు నాకు ధర్మపత్నివి కావలసినది' అని వేడుకున్నాడు. ఈమాటలు సీతను మోసగించి స్వాధీనంచేసుకునేటందుకు పలికినవేమో అనిపించవచ్చును. అందుచేత ఇంకొకసందర్భంలోని రావణుని అభిప్రాయాలను వివరించుతాను.

రాముడు వానరసైన్యంతో యుద్ధానికి సిద్ధం కాగానే రావణుడు మంత్రులనూ బంధువులనూ ఆహ్వానించి సభ చేసి 'నా స్వప్రయోజనం కోసం సీతను అపహరించాను, ఆమెభర్త ఇప్పుడు యుద్ధానికి వచ్చాడు. ఈయుద్ధంవల్ల కేవలం నాకేకాక మీకూ నష్టం కలుగుతుంది; కనుక మీ అభిప్రాయం తెలపండి:

"సా మే న శయ్యామారోఢు మిచ్ఛ త్యలసగామినీ
త్రిషు లోకేషు చాన్యా మే న సీతాసదృశీ మతా.
ఉన్నాసం వదనం వల్గు విపులం చారులోచనమ్
పశ్యం స్తదా వశ స్తస్యాః కామస్య వశ మేయివాన్.
క్రోధహర్షసమానేన దుర్వర్ణకరణేన చ
శోకసంతాపనిత్యేన కామేన కలుషీకృతః.
సా తు సంవత్సరం కాలం మా మయాచత భామినీ,
ప్రతీక్షమాణా భర్తారం రామ మాయతలోచనా.
త న్మయా చారునేత్రాయాః ప్రతిజ్ఞాతం వచ శ్శుభమ్
శ్రాన్తోహం సతతం కామా ద్యాతో హయ ఇవాధ్వని.

కిం కరిష్యామి భద్రం వః కిం వా యుక్త మనన్తరమ్
ఉచ్యతాం చ సమర్థం యత్కృతం చ సుకృతం భవేత్."

'ఆ సీత నాకెయ్యి ఎక్కువ ఇష్టపడడం లేదు. మూడులోకాలలోనూ సీతకు సరిపోయే స్త్రీ నాకు నచ్చినది లేదు. ఎత్తయిన ముక్కు, అందము విశాలములు అయిన కన్నులు, ఆ సీతముఖాన్ని చూసినప్పుడు నేను మన్మథుడి వశ మైపోతున్నాను. కోపకాలమందూ సంతోషకాలమందూ సమానంగా వైవర్ణ్యం గలవాడూ, దుఃఖం కలిగించడంలో ఎడతెరిపి ఈయనివాడూ అయిన మన్మథుడి వల్ల కలుషీకృతుడను అయినాను. విశాలమైన కన్నులున్న ఆమె భర్త అయిన రాముణ్ణి నిరీక్షించను ఒక యేడాదిగడువు కోరినది. అందమైన కళ్లుగల ఆ సీత ప్రతిజ్ఞచేసిన ఆ శుభకరమైన మాటను విని, చాలాదూరపు నడకనుంచి గుర్రమువలె కామమునుంచి శ్రాంతి పొందాను. ఏది మనకు యుక్తమూ భద్రమూ అయినదో, ఏది మనకు సమంజసమో, ఏది చేసిన మనకు సుకృతమో దానిని చెప్పండి, నేను చేస్తాను' అని ఏ దాపరికమూ లేకుండా తెలిపి అతిన్యాయంగా వారి సలహాను అభ్యర్థించాడు. సీతసమక్షాన పలికిన మాటలు మోసగించడానికే అయినట్టయితే అంతరంగికులవద్ద ఈమాటలు అమాయికంగా చెప్పి వారిసలహాను అంతన్యాయంగా అడగవలసిన అగత్యం కనిపించదు. దీనినిబట్టి సానుభూతితో ఆలోచిస్తే రావణుడు సీతమీద నిజమైనప్రేమతో బాధపడినట్టు సహృదయులు అంగీకరించక తప్పదు.

ఇది కాక రావణున్ని గురించి భోజుడి శృంగారప్రకాశంలో:

ఆజ్ఞా శక్రశిఖామణిప్రణయినీ, శాస్త్రాణి చక్షుర్నవం,
భక్తి ర్భూతపతౌ పినాకిని, పదం లంకేతి దివ్యా పురీ,

ఉత్పత్తి ద్రుహిణాన్వయేచ, తదహో నేదృగ్వరో లభ్యతే
స్యాచ్చేదేష న రావణః, క్వనుపున స్సర్వత్ర సర్వే గుణాః!

'ఎవడిఆజ్ఞ ఇంద్రుని తలమాణిక్యానికి ప్రణయినో, ఎవడు శాస్త్రాలనే కన్నులుగా చూస్తాడో, ఎవడు పినాకము ధనుస్సుగాగల భూతపతిని భక్తితో ఆరాధిస్తాడో, ఎవడిస్థానం లంకఅనే దివ్యపురం, ఎవడు బ్రహ్మకులంలో ఉద్భవించాడో అటువంటి ఇతడు రావణుడు అనిపించుకునేవాడే కాకపోయినట్లయితే, ఇటువంటి వరుడు లభిస్తాడా? అంతటా అన్ని గుణాలే ఉండవుకదా!' దీనినిబట్టి రావణుడనే పేరు మాత్రమే అతని అపఖ్యాతి.

ఈ పేరు ఎంతవింతగా పుట్టినదో చూపుతాను: 'రావం' అనగా గోల. రావం కలిగించేవాడు, అంటే గోలపెట్టించేవాడు రావణుడు అనే అర్థం నిర్ణయం. ఈపేరు ముందు ఖితాబుగానే మంచిగానే కలిగింది. శత్రువులను గోలపెట్టించేవాడు కనుక రావణుడు అనే బిరుదు వచ్చింది. దీనిలో రాముడూ తక్కువవాడు కాడు. అతనూ రావణుడే, రాక్షసకులాన్నంతా రావంతో వించిన రావణుడు. ఇంతేకాని ఈ రావణశబ్దం అన్యాయంగా ప్రజలను గోలపెట్టించినవాడు కావడంవల్ల చెడ్డగా కలిగినది కాదు. ఇందుకు అధికారం. సుందరకాండలో - 'ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణః శత్రురావణః' - శత్రురావణుడైన రావణుడు' అన్నాడు వాల్మీకి. అయితే ఈశబ్దానికి నేటికి వాడుకలో ఉన్న దుష్టార్థం ఎట్లా కలిగింది అనిపిస్తుంది. రామదిగ్విజయాన్ని కీర్తిస్తూ, విరోధిని లోకకంటకునిగా, వధింపదగినవాణ్ణిగా నిర్ణయించడానికి రావణశబ్దాన్ని చెడ్డగా మార్చి ఉపయోగించడం కవి చాకచక్యమే కదా! సంఘసంస్కరణాభిలాషులు 'ఈమె వివాహాము

చేసుకున్న వితంతువు' అని తెలిపితే సంఘదార్ఢ్యానికి లొంగి లోలోపల చెడ్డగా ప్రవర్తించక, ధైర్యంగా వివాహంచేసుకున్న ఆమె అని మన్ననగా చెబుతారు. ఆమెనే 'వివాహం చేసుకున్న వితంతువు' అని ఏ సనాతనుడో అంటే ఇద్దరు భర్తలను అంగీకరించి మతంచెడిన ఆమె అనుహేళనవాక్యంగా ఎంచవలసిఉంటుంది. ఉద్దేశానికి తగినట్టుగా దేనినైనా వాడవచ్చునుగదా. రావణశబ్దం ఈవిధినే పొందింది.

ఈ సందర్భంలోనే రాక్షసశబ్దాన్ని కూడా పరిశీలిస్తాను. అసలు శబ్దం- 'రక్షస్' రక్షించేవారు అని. ఇందులకు అధికారం - 'రక్షామ ఇతి యై రుక్తం రక్షసాస్తే భవంతు వః, యక్షామ ఇతి యై రుక్తం యక్షా ఏవ భవంతు వః'. సృష్ట్యాదిని రక్షణకు పూనుకున్నవారు రక్షసులైనారు. అమరంలో రాక్షసులనూ దేవయోనులలో కలిపి చెప్పాడు:

విద్యాధరోప్సరో యక్ష రక్షో గంధర్వ కిన్నరాః
పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోమీ దేవయోనయః.

అసురశబ్దంకూడా ఇటువంటిదే. అసురప్రోక్తాలయిన సూక్తాలు కొన్ని ఋగ్వేదం దశమమండలంలో ఉన్నవి. వీటినిబట్టి యోచిస్తే రాక్షస అసుర శబ్దాలు రావణశబ్దంవలెనే, భయంకరకృత్యాలతో కలిపి వాడడంవల్ల ఈనాటి అర్థాలకు గురి అయినవి అని తెలుస్తుంది.

అయితే వాల్మీకి రావణుణ్ణి అంత దుర్మార్గునిగా ఎందుకు కల్పించవలెను అనిపిస్తుంది. రామునికథను రామాయణంగా కూర్చడం ఏకారణంచేతనో అందులకు అనుకూలం రావణుణ్ణి అవిధంగా చేయడం. ఈ విషయాన్ని ఆఖర్ని, నిరూపిస్తాను—. ఇదికాక అనాటి ఆర్య

అనార్య సంఘర్షణలో ఆర్యులకృత్యాలను సమర్థించడం ఒక ఉద్దేశం. ఇది ఎంతవరకూ నిజమో విచారణచేస్తాను :

ఈ దేశంజాతకం ఎంతదురదృష్టజాతకమో, ఏ పరజాతి చొరబడివచ్చినా వారి స్వాధీనం కావడమేగాని, ఒక్కసారి అయినా స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవడం నోచుకోలేదు. రెండువందల సంవత్సరాల క్రితం తెల్లవారి చేతులలోనూ, 926 సంవత్సరాలక్రితం ఘజ్నీప్రారంభం మహమ్మదీయుల చేతులలోనూ చిక్కుపడి వారి స్వాధీనం కావడం, విమర్శిస్తేనేకాని తేలని విషయం కాదు. ఎంతటి సనాతనులైనా కాదని వాదించడానికీ, చరిత్రను విశ్వసించక మూర్ఖంగా కన్నులు మూసుకుని వాదించినా 'ఏమో' అనిపించడానికీ, నిజమైనజీవంతో ఉన్న ఏ దేశపుత్రుడూ ఆత్మాభిమానాన్ని దిగదీసుకోకుండా సమాధానపడడానికీ వీలులేకుండా గుండెలమీద కుంపటిగా అయిపోతూవున్న ఈనాటి పరజాతుల దబాయింపువంటిదే ఆనాటి ఆర్యులకూ దేశస్థులైన ఇతరజాతులకూ జరిగిన వైరుధ్యం.— 'ద్వయాహ ప్రాజాపత్యా దేవా శ్చాసురాశ్చ. తతః కానీయసా ఏవ దేవాః జ్యాయసా అసురాస ఏషు లోకేష్వస్పర్థన్త'— 'ప్రజాపతి సంతతి ఇరు తెగలు, దేవతలు అసురులు. దేవతలసంఖ్య తక్కువ, అసురులసంఖ్య ఎక్కువ. లోకాలను పొందడానికి వీరిలో పోటీపడినది' అని బృహదారణ్యకోపనిషత్తు మూడవ బ్రాహ్మణం ఒకటవ మంత్రం. — దశరథుడి కాలంనాటికి గంగదక్షిణతీరంనుంచీ దుర్గమమైన దండకారణ్యమే. ఆర్యులు సింధుగంగాతీరప్రదేశాలనే ఆక్రమించుకున్నారు. దండకారణ్యాన్ని దాటి దక్షిణదేశాలలో ఉన్న జాతులను మొదట జయించినవాడు రాముడే. తమ మతాన్ని కాదని

నిరోధించి, ఇతర అడవిజాతులవలె సులభంగా లొంగక అతితీవ్రంగా ఎదిరించి ఢీకొన్న నాగరకులూ యుద్ధనిపుణులూ అయిన రావణతెగ వారిని ఓడించి లొంగదీసిన రాముణ్ణి ఆనాటి ఆర్యలోకం ఎంత ప్రశంసించి ఉంటుంది. అతని కీర్తి శాశ్వతంగా ఉంటే, తమ ప్రతిభ చిరస్థాయి అవుతుంది కదా అని ఎన్నెన్ని నిర్మాణాలు చేసి ఉంటుంది. లేకపోతే చేసిన ఆ శాస్త్ర కార్యానికి రాముడు అంతపొగడ్త పొందడానికీ, నాయకునిలో ఇన్ని లోపాలున్న రామకథ ఇంతపవిత్రమై ఆసేతుహిమాచలం ఇంత ప్రచారమైపోవడానికీ అవసరం కనిపించదు.

రామాయణకాలంలో ప్రారంభించిన ఈ దిగ్విజయం భారతకాలానికి ఇంకొకమార్పు చెందింది. అక్బరుకాలానికి రాజపుత్రులూ ముఘలులవలె, భారతకాలానికి ఆర్యులూ దేశస్థులూ పరస్పర సంబంధ బాంధవ్యాలలోనికి దిగి, విరోధాలు మాని, ఒక్క తెగగా కలిసిపోక తప్పింది కాదు. క్రమేణా దేశస్థుల నీతులనూ ధర్మాలనూ మతపద్ధతులనూ కొంతవరకు ఆర్యులుకూడా అంగీకరించారు. అందువల్లనే కృష్ణుడు రుక్మిణిని అసురపద్ధతిని వివాహమాడడమూ, భీముడు హిడింబనీ, అర్జునుడు ఉలూపీసుభద్రలను భార్యలుగా స్వీకరించి ఆర్యసమ్మతాన్ని పొందడమూ తటస్థించింది.

ఈ విధంగా అనార్యులతో కలిసిపోతూన్నప్పటికీ ఆర్యులు అన్ని తెగలవారినీ ఏదోవిధంగా ఆర్యసాంప్రదాయాలకు లొంగదీయడమూ ఆర్యశబ్దానికి సమస్తమర్యాదలూ చేర్చడమూ జరుగుతూనే వుంది.

ఈ దేశస్త్రీలకు పాశ్చాత్యతెల్లజాతులవల్ల జన్మించిన ఏంగ్లోఇండియనులు తెల్లవారి సంతతివారమని చెప్పి గర్విస్తూవున్నట్లు ఆర్యసం

తలివార మనిపించుకోవడం గొప్పగానే తేలింది; ఈవిధంగా యావద్భారతం చివరకు ఆర్యమయం అయిపోయింది. క్రమేణా ఆర్యులు చేసిన అకార్యకరణాలను సహితం సమర్థించడమూ, అనార్యుల స్వరతృణా దేశాభిమానమూ రాక్షసమూ దుర్మార్గమూ కావడమూ అయి, చివరకు ఆర్యశబ్దం అన్ని సుగుణాలనూ, అనార్యశబ్దం అందుకు వ్యతిరేకమైన సమస్త అవమానాలనూ సూచించేటట్టు వాడుక అయిపోయింది. ఈనాడు తెల్లవారు నీగ్రోజాతిని 'నిగర్' nigger అంటారు. నిగర్ అంటే, నల్లవాడు అనే వర్ణభేదమే కాకుండా నీచుడూ అసహ్యపువాడూ అనే అర్థంలో వాడుతున్నారు. ఈ నిగ్గర్ పరిణామాన్నే పొందింది అనార్యశబ్దం.

ఈ ఆర్య అనార్య వైరుధ్యం ఎంతవరకు విశ్వసనీయం అంటే, ఈనాడు మనకళ్లయెదరనే జరుగుతూన్న విషయాన్ని తార్కాణగా చూపుతాను:

తెల్లజాతులు రంగుజాతులను చాలావరకు తమ స్వాధీనం చేసుకున్నవి; ఇంకా చేసుకుంటూ వున్నవి. తమయత్నం దుర్నీతి అనిపించుకోడానికి అవకాశం లేకుండా రంగుజాతుల మతాలనూ నీతులనూ అపహాసించి, నీచమైనవిగా ఎంచి ప్రచారం చేస్తూ వున్నవి.

తెల్లజాతుల ఈ యత్నం ఫలించింది అనుకుందాము. అప్పుడు మిస్ మేయో భారతదేశాన్ని గురించీ, ఫిలిప్పైనుదీవులను గురించీ వ్రాసిన వ్రాతలూ, నల్లనీగ్రోలను గురించి అమెరికా ఆఫ్రికాలలోని తెల్లవారు వ్రాస్తూవున్న వ్రాతలూ స్థిరపడి, రామాయణాది గ్రంథాలలోని అనార్యనీతులూ ధర్మాలూ వలె భారతీయులనీతులూ ధర్మాలూ

నీచము లైపోతవి. అప్పుడు రంగుజాతులు ఒకనాటి అసురులూ రాక్షసులూ వలె ప్రపంచానికి కంటకమైన దుర్జాతులై, తప్పకుండా నశింపు పొందవలసిన మలినులు అయిపోతారు. తెల్లవారు స్వార్థంకోసం చేసిన ఈ అన్యాక్రాంతాలూ అన్యాయాలూ ప్రపంచకళ్యాణానికి అని స్థిరపడిపోతవి.

వాల్మీకి ఆర్యపక్షంగానూ అనార్యకక్షగానూ వ్రాసిన గ్రంథం కాకపోతే రావణుడి అసలు పేరు ఎందుకు వాడలేదు? ఇది కాక ఎంతటి దురాత్ములైనా అంత అర్థయుక్తంగా అసహ్యపు పేర్లు పెట్టుకోలేరు గదా! రాక్షసస్త్రీల పేర్లు చూడండి: దుర్ముఖి, వికట, చండోదరి, అజాముఖి, శూర్పణఖ...ఇత్యాది. వాళ్లయెడ అసహ్యత కలిగించవలెననే ఉద్దేశంతో కవి కల్పించిన పేర్లు అనడం ఎంతమాత్రమూ సత్యదూరం కాదు. ఈవిధంగానే రష్యా జపానుయుద్ధకాలంలో రష్యావారు జపానువారిని 'కోతిముఖులు' monkey-faced అనేవారు.

ఈ కారణాలన్నీ కాక ఇంకొక రహస్యంకూడా ఉన్నది. వాల్మీకి కాలం 2280 బి. సి. అనగా నేటికి 4214 సంవత్సరాలక్రితం. వేదంలోని ఛందోనియమాలను లౌకికభాషకు ఉపయోగించి వేదాలలో అక్కడక్కడఉన్న అనుష్టుప్పును విరివిగా వాడిఒకకవిత్వపంథా తొక్కిన వాడు వాల్మీకి. ఈ నాటికీ సంస్కృతవాఙ్మయంలో ఆయన రామాయణానికిగల కవితావైశద్యం మహాభారతానికి లేదు. ఇంతవిలువ పొందినరామాయణం కల్పించిన సాంప్రదాయమే మొన్నటివరకూ ఈ దేశంలోని ప్రతిభాషకూ పలుకుబడి అయిపోయింది. ఆనాడు

ప్రారంభమైన కళాసంపత్తిలో ప్రధానమైనది ఉత్ప్రేక్ష. ప్రతివిషయాన్ని గోరంత కొండంతగా వర్ణించడం. నాయకుని లోకోద్ధరణ ప్రశంసించడానికి విరోధిని రాక్షసునిగా లోకకంటకునిగా నిరూపించడం మామూలు. ఈవిధానంలో వాల్మీకి ఒక్కడే కాదు, గ్రీసుదేశమహాకవి, హోమర్ 3120 సంవత్సరాలక్రితం వ్రాసిన 'ఇలియడ్' 'ఒడిస్సే' 'బ్రెటకోమియోమేకియా' అనే గ్రంథాలలో కూడా ఈ విధానమే గోచరమౌతుంది. 'ఒడిస్సే' దేశదేశాలను జయించి గొప్ప ప్రభువుగా జీవించిన ఒకవీరుని కథ. రామాయణం వంటిదే. దానిలో వర్ణించిన నాయికానాయకు లందరూ సామాన్య మనుష్యులవలె కాక దేవతాంశసంభూతులవలె కనబడతారు. రామాయణాన్ని ఈనాటికీ మన పండితులవలె చాలాకాలం హోమర్ గ్రంథాలను గ్రీకుపండితు లందరూ కంఠస్థంచేసేవారు. గ్రీకుభాష చాలావరకు హోమర్ కావ్యాలలో నుంచే పుట్టినది. హోమర్ కథనడిపించే విధమూ ఆ వర్ణనలూ ఆనాటి మన పురాణేతిహాసాల ఫక్కీ మోస్తరే. ఆనాటివారి భావప్రపంచం అటువంటిది; ఆనాటివారి మనస్సునకు ఆనందాన్ని కూర్చేది అటువంటి రచనావిధానం; ఆకాలంలో అది ఉత్తమ కళ.

ఇదికాక, మనువు నాటికి కూడా రాజు దైవాంశసంభూతుడు 'నావిష్ణుః పృథివీపతిః' అనేవారు. సామాన్యరాజే విష్ణ్వంశసంభూతుడైతే, ప్రపంచాన్ని' ఉద్ధరించను అవతరించినాడు అనవలసినరాజు కేవలం విష్ణువుఅవతారం కావడం ఆశ్చర్యంకాదు గదా! అటువంటి రాజును ఎదిరించినంతమాత్రాన ప్రతికక్షివారు రాక్షసులుగానూ, లోకకంటకులుగానూ ప్రజాక్షేమాన్ని భంగపరిచేవారుగా [dangerous to public tranquility] మారిపోక తప్పదుగదా!

వాల్మీకినుంచి ప్రభవించి పురాణాలనాటికి విపరీతంగా పెరిగిన రచనావిధానం మామూలు ఏమిటంటే: ఈరాక్షసులు చేసిన దుర్మార్గాలకు పద్నాలుగులోకాలూ హాహాయని ఘోష పెట్టేవి, సప్తసాగరాలూ ఘూర్ణిల్లేవి, పతివ్రతలంతా మానభంగమైనట్లు ఆర్తనాదాలు చేసేవారు, తపస్సు నిరపాయంగా జరగని మునీశ్వరులందరూ ఒక్కుమ్మడిని బ్రహ్మను ప్రార్థించేవారు, ఆ పురాణపూరుషుడు విష్ణుమూర్తిని ఉద్బోధించేవాడు, అప్పుడు పాలసముద్రంలో తీరికగా లక్ష్మీదేవితో మాయనిద్రలోఉన్న మహావిష్ణువు పాముపడక వొదిలి,శంఖుచక్రాలను ధరించి, ముందు తానూ, ఆ తరువాత శేషుడూ, ఆ తరువాత లక్ష్మీదేవీ భూలోకంలో అవతరించి అనేకవంకలు కల్పించి ఆ దుర్మార్గులను వధించి, పతివ్రతల మానములు రక్షించి, తనకోసం మునులు చేస్తూవున్న తీవ్రతపస్సులు నిర్విఘ్నంగా సాగేటట్లు అనుగ్రహించి, ప్రపంచాలను ఉద్ధరించి, అవతారం చాలించి మళ్లీ మాయనిద్రకోసం పాలసముద్రం చేరుకునేవాడు.

ఇదీ ఆ కాలంలో కథ నడిపించే విధమూ, కవి కళాసంపత్తీ. ఏ పురాణం చూసినా ఇదే తలనొప్పి.

ఈ విధానమునకు సామగ్రికావడంలోకూడా రావణుడు రాక్షసుడూ లోకకంటకుడూ అయినాడు. ఈ కారణాలన్నీ గణిస్తే రావణునిపక్షం ఆలోచించడం న్యాయమౌతుందికదా! నా యత్నానికి ఇది ముఖ్యకారణం.

2. 'ఉత్కృష్ట ఆదర్శాలుగా ఏర్పడిపోయిన సీతారాముల జీవితాలకు ఈవిధంగా నూతనఅర్థకల్పనచేస్తే, నిర్ణయంగా ఒకదారిని యీ తీర్పునూ ఉన్న జాతిని వృథాగా అంధకారంలో ముంచడంకాదా?' అన్న రెండవ ఆక్షేపణను విమర్శిస్తాను:

'రామరాజ్యము' అంటే, యేవిధంగానూ అన్యాయం జరగకుండా అతినీతియుక్తంగా పాలన జరగడమనీ, రాముడి పరిపాలనావిధానం కలకాలానికీ ఆదర్శప్రాయమైన పాలనావిధానమనీ ఈ నాటి ప్రజాభిప్రాయం. ఇది ఎంతవరకూ సత్యమో రామాయణంలోని కొన్ని సందర్భాలనుబట్టి తర్కించుతాను.

దోషంచేసినవారు పదిమంది తప్పుకుపోయేటట్టుగా ఉన్నాసరే కాని నిర్దోషి ఒక్కడయినా శిక్షితుడయ్యేటట్టుగా ఉండకూడదు అని న్యాయచట్టనిర్మాణంలో మొదటిసూత్రంగా ఈనాటి 'లా' కూడా అంగీకరిస్తుంది. అటువంటప్పుడు ఏ దోషమూ చేయకుండా, ప్రపంచంలో ఏనిమిత్తమూ లేకుండా, ఎక్కడనో మారుమూల తన ముక్తికోసం తపస్సుచేసుకుంటూవున్న శంబూకుణ్ణి వధించడం ఏమి న్యాయం? తపస్సుహక్కులు తమకు తప్ప ఇతరులకు ఉండరాదనే దురహంకారులైన బ్రాహ్మణులు, ఏ లోపంవల్లనో చచ్చిన బ్రాహ్మణ శిశువు శంబూకుని అపరాధమువల్లనని మొరపెట్టవచ్చును. కాని ఆ మొరను మన్నించి ఆ దురహంకారుల పొగడ్తలనుకూడా పొందుదామనే కాంక్షతో రాముడు ఆ అమాయకుణ్ణి చంపడం ఏమిన్యాయం? తన ముక్తికి తాను ఒకమూల కూర్చొని యత్నించేసికోవడం తప్పుఅని నిర్ణయించేది ఏ విధంగా ధర్మమవుతుంది? ఆనాటిప్రజల మన్ననకోసం కలకాలానికీ నిందించదగ్గ హత్యనుచేసిన రాముడు ఏ కళంకమూ లేని ఆదర్శపురుషుడుగా మన్ననకు ఎట్లా పాత్రుడౌతాడు?

ఒకచాకలి తనభార్యను సీతతో పోల్చి నీచంగా మాటలు అన్నంత మాత్రాన, అన్నిబాధలు భరించి యమయాతనలను ఓర్చిన ఆమెను, బ్రతుకూ ఆత్మ తానుకాను అంతా రామమయమే అని జీవిస్తూన్న ఆ మహాఇల్లాలిని, అన్నిటికన్నా అన్యాయం నిండుచూలాలిని అడవులలో నిస్సహాయిగా నీచత్వానికి ఒడిగట్టి విడిచిపెట్టించాడు. ఉత్తర రామచరిత్రలో ఈసందర్భంలోనే 'ఓయి కఠినుడా, ఎప్పుడూ యశస్సే ప్రియంగా దేవుళ్ళాడుతావు ఇంతకన్న అపయశస్సు ఉన్నదా ?' అని వాసంతిచేత రాముణ్ణి చివాట్లు వేయించాడు భవభూతి. ఒకచాకలి నోట సహితం తనకు అపఖ్యాతికరమైనమాట రాకూడదు అనే చచ్చు కాంక్ష కాకపోతే, ఇంత క్రూరం, నీచం, అసహ్యం అయిన పని చేయవలసిన అగత్యం ఏమున్నది ? ఒకచాకలి'వోటు' కూడా పోకుండా జాగ్రత్తపడవలెననే ఆత్రుత ఉండడానికి ఈనాటి జిల్లా బోర్డు ప్రెసిడెంటా, తాలూకాబోర్డుప్రెసిడెంటా రాముడు ?

ఇంతకూ సవిమర్శంగా పరిశీలిస్తే, రాముడు ఉత్త కీర్తికాముడు. కీర్తికోసం దేనికైనాసరే సంసిద్ధపడేవాడు. సీతయెడల ఇతని ప్రవర్తన చూడండి. రావణుణ్ణి ఎంతో క్లిష్టపరిస్థితులలో ఒప్పించి సంవత్సరం గడువుఅడిగి భర్తకోసం, భర్తృవిజయంకోసం తపస్సుచేస్తూ మూత యెరగని కన్నుగా నిరీక్షించిన ఆ సీతను, రావణాసంహారణ కాగానే రమ్మని విభీషణునిద్వారా కబురుపంపించాడు.

విస్మయాచ్చ ప్రహర్షాచ్చ స్నేహాచ్చ పతిదేవతా,
ఉదైక్షత ముఖం భర్తు సౌమ్యం సౌమ్యతరానసా.

'పతిని దైవంగా యెంచే ఆమె, ఆశ్చర్యంవల్లనూ, సంతోషంవల్లనూ స్నేహంవల్లనూ సౌమ్యమైన ముఖంతో'... 'సా వస్త్రసంరుద్ధముఖీ

లజ్జయా జనసంసది'- 'సిగ్గువల్ల ముఖాన్ని బట్టతో కప్పుకుని' కన్నీటి బొట్టువలె కరుణామూర్తిగా ఎదరనిలుస్తే 'హృదయాన్తర్గతక్రోధో వ్యాహర్తుముపచక్రమే'- 'హృదయంలోని కోపాన్ని తెలియజేయను ప్రారంభించి' అన్నమాటలు ఎంతనీచంగానూ, అవమానకరంగానూ, అప్రస్తుతంగానూ ఉన్నవో చూడండి.

ఏషాసి నిర్జితా భద్రే శత్రుం జిత్వా మయా రణే,
పౌరుషా ద్యదనుష్ఠేయం తదేత దుపపాదితమ్.
గతోఽస్మ్యన్త 'మమర్షస్య ధర్షణా సమ్ప్రమార్జితా,
అవమానశ్చ శత్రుశ్చ మయా యుగప దుద్ధృతా.
అద్య మే పౌరుషం దృష్ట మద్య మే సఫలః శ్రమః
అద్య తీర్ణ ప్రతిజ్ఞత్వా త్ప్రభవామీహ చాత్మనః.
యా త్వం విరహితా నీతా చలచిత్తేన రక్షసా,
దైవసంపాదితో దోషో మానుషేణ మయా జితః.
సమ్ప్రాప్తమవమానం యస్తేజసా న ప్రమార్జతి,
కస్తస్య పురుషార్థోఽస్తి పురుషస్యాల్పతేజసః.
రక్షతా తు మయా వృత్త మపవాదం చ సర్వశః,
ప్రఖ్యాతస్యాత్మవంశస్య న్యఙ్గం చ పరిరక్షతా.
నిర్జితాసి మయా భద్రే శత్రుహస్తా దమర్షిణా,
ప్రాప్తచారిత్రసన్దేహా మమ ప్రతిముఖే స్థితా.
ఏతా దశ దిశో భద్రే కార్యమస్తి న మే త్వయా,
కః పుమాన్ హి కులే జాతః స్త్రియం పరగృహోషితామ్.
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్,
తదర్థం నిర్జితా మే త్వం యశః ప్రత్యాహృతం మయా.

తేజస్వీ పునరాదద్యాత్సుహృల్లేఖ్యేన చేతసా,
రావణాఙ్కపరిభ్రష్టాం దృష్టాం దుష్టేన చక్షుసా.
నహి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోహరమ్,
మర్షయేత చిరం సీతే స్వగృహే పరివర్తినీమ్.
నాస్తిమే త్వయ్యభిష్వఙ్గో యథేష్టం గమ్యతా మితః
ఇతి ప్రవ్యాహృతం భద్రే మయైతత్కృతబుద్ధినా.
లక్ష్మణే భరతేవా త్వం కురు బుద్ధిం యథాసుఖమ్,
సుగ్రీవే వానరేన్ద్రే వా రాక్షసేన్ద్రే విభీషణే
నివేశయ మనస్సీతే, త్వం యథాసుఖ మాత్మనః.

'యుద్ధంలో శత్రువును జయించి నిన్ను జయించాను. పౌరుషం చేయదగినపనిఏదో అది అయినది. నా కోపంఅంతాన్ని పొందినాను. ఇతరులకొత్తిడి తుడిచివేయడమూ, అవమానాన్ని శత్రువునీ ఒక్కమారుగా నేను తీసివేయడమూ అయినది. నేడు నా పౌరుషం విశదమయింది. నాశ్రమ ఫలించినది. నేను ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నవాడను అయినందున నాఆత్మకు నేను ప్రభువునై ఉన్నాను. దగ్గర నేనులేని నిన్ను రాక్షసుడు తీసికొనిపోవడం తటస్థించింది; దేవుడివల్ల కలిగిన దోషం మనుష్యుడనైన నావల్ల జయించడమయింది. ప్రాప్తించిన అవమానాన్ని తన తేజస్సుతో ఎవడు పోగొట్టలేడో అల్పతేజస్కుడైన ఆ పురుషుని పురుషార్థం ఏమిటి? ప్రసిద్ధమైన వంశవృత్తాంతాన్ని అంతటావచ్చే అపవాదుని రక్షిస్తూన్న నావల్ల శత్రువుచేతులలోనుంచి నిన్ను జయించడము జరిగింది. సందేహించదగిన చరిత్ర్యంగల నీవు నాయెదటనిలిచి ఉన్నావు; ఈ పదదిక్కులా నాకు నీతో

ప్రయోజనం లేదు. మంచికులంలో పుట్టిన ఏ పురుషుడు పరగృహంలో ఉన్న స్త్రీని తిరిగి తీసుకుంటాడు? రావణుడితోడవల్ల భ్రష్టవయి అతని దుర్మార్గపు కన్నుల చూపులకు గురిఅయిన నిన్ను తేజస్సుగల ఏ పురుషుడు తిరిగి తీసుకుంటాడు? గొప్పకులాన్ని చెప్పుకుంటూ నిన్ను నేను తిరిగి ఎట్లా తీసుకుంటాను? నా కీర్తి నేను తిరిగి సంపాదించుకున్నాను. అందుకోసమే నిన్ను జయించడం జరిగింది. దివ్యరూపం గలిగి మనోహరురాలవై, ఇంటిలో ఉన్న నిన్ను చూసి రావణుడు చిరకాలం సహించి ఉండడు. నీమీద నాకు కోరికలేదు. నిశ్చయమైన బుద్ధితో చెబుతున్నాను. నీవు ఇక్కడనుంచి నీ యిష్టప్రకారం పో, లేదా లక్ష్మణభరతులలో, సుగ్రీవవిభీషణులలో ఎవరివల్లను సుఖముంటే వారిపైన మనస్సుచేసికో' అని, సీత జవాబులో పౌరుషంగా పలికినట్టు, తక్కువవాడు తక్కువవారిని అననలసినట్టుగా మాటలన్నాడు. సూర్యవంశకీర్తితోనూ, మహాశత్రువును జయించినానన్న ఒల్లమాలినగర్వంతోనూ తలతిరుగుతూవున్న తనకు రావణాంకపరిభ్రష్ట పనికిరాకపోతే పొమ్మనవచ్చును సరే; కాని లక్ష్మణభరతులనో సుగ్రీవవిభీషణులనో చూసుకొమ్మనడం క్షమించడానికి వీలులేని నీచపుమాట కాదా! ఇటువంటిధూర్తుణ్ణి ఆదర్శప్రాయమైన భర్తగా ఎంచడంవల్ల అన్యాయంగా స్త్రీలను ఎంత దిగదీస్తున్నామో, పురుషుల్ని ఎంత పొగరుబోతులను చేస్తున్నామో ఇంతకైనా గ్రహించలేకపోతే,

తన ధర్మపత్నియెడల ప్రజాభిప్రాయం దుష్టంగా ఉన్నప్పుడు ధర్మంముల్లుచూపిన విధానాన్ని ధైర్యంతో అనుసరించిన ఒక మహానుభావుని తార్కాణచరిత్ర్యాన్ని రామునితో పోల్చి చూపుతాను. అఫ్గనిస్థానంలో ఇస్లాం మతం. స్త్రీలకు కఠినమైన

ఘోషాను మతమే కానిస్తుంది. అమానుల్లా రాజు, సౌరీయా రాణి. ఈ దంపతులు మంచి విద్యావంతులు. నేటి ప్రపంచంలోని యితర దేశాల ఔన్నత్యంతో తమదేశం ఏవిధంగానూ పోల్చవీలులేక నిర్విద్యగా, నిస్తేజంగా, పేదగా ఉండడం గ్రహించి, పాశ్చాత్యదేశాల నాగరకవిధానాలను స్వయంగా పరీక్షించివచ్చి తమదేశాన్ని సంస్కరించను పూనుకున్నారు.

తమ దేశస్త్రీలు పురుషులకు వాంఛ కలిగినప్పుడు వారి కామవికారాలకు భోగవస్తువులుగా ఉన్నప్పుడు తప్ప యేవిధంగానూ జీవిస్తూన్న మనుష్యప్రపంచంలో లెక్కకాకుండామా, దేశానికి యేవిధంగా ఉపయుక్తులు కాకుండానూ ఉండడానికి ఘోషా మూలకారణమని గ్రహించి, ఈస్థితిమారి తమస్త్రీలూ ఇతరదేశస్త్రీలవలె విద్యావతులూ దేశసేవకులూ, స్వతంత్రులూ కావడానికి మొదటి మెట్టుగా సౌరీయా రాణి తానే ముందుగా ముసుగు తీసివేసింది.

ఘతం మూర్ఖతలో పట్టుబడి, ప్రపంచంపొందుతూన్న పరిణామంలో వెనకబడిపోతూన్నామని అయినా గ్రహించలేక, ఇతర మతాలతోనూ, ఇతరజాతులలోనూ, తమజాతినీ తమదేశస్థితినీ పోల్చిచూసుకోలేకుండా ఉన్న ప్రజాబాహుళ్యం అమానుల్లావద్దకు వచ్చి, 'మత విరుద్ధంగా సౌరీయా ఘోషాను తొలగించి శీలంచెడినస్త్రీఅయినది, కనుక మీరు ఆమెను విడిచిపెట్టవలసింది' అని కోరుకున్నారు.

ఒక్క చాకలినోటనే కాదు, ప్రజాబాహుళ్యంలో ఈ కల్లోలం కలిగింది. అయినా అమానుల్లా రామునివలె స్వార్థం ఎంచలేదు. తన పేరుప్రతిష్ఠలకోసం ఆలోచించలేదు. ధర్మం ఎటు వేలుచూపితే

అంటే శుద్ధాంతఃకరణను సాగించి పలికాడు, "స్త్రీయే నా ధర్మపత్ని. ఈ ప్రపంచంలో ధర్మజీవితంలో కలిగే కష్టనిష్టూరాలనూ సుఖదుఃఖాలనూ భాగస్వాములుగా పంచుకుందామనే శపథమే కదా వివాహం. ఆ ధర్మబంధానికి కట్టుబడతాను. ఆమె పతివ్రత, నేను పత్నీవ్రతుడను. దేశం మేలును కోరే రాణి చేయవలసిన సంస్కారమే అది. నా ఆశయం కూడా అదే. ఆమె చేసింది ఏవిధంగానూ దోషం కాదు. ఆమె పక్షాన్ని నిలుస్తాను; రాజ్యాన్ని త్యజించి అయినా సరే"

అని తన నిశ్చయాన్ని ప్రజలకు తెలియబరిచాడు. అంతేకాని రాజ్యంకోసమూ, ప్రజల సద్భావంకోసమూ కక్కుర్తిపడి ఆమెయెడ అన్యాయంగా ప్రవర్తించలేదు. పోనీ అమానుల్లా ప్రజలను ప్రేమించని ప్రభువా! చూడండి: తిరగబడిన ప్రజలను అణిచి పాలన సాగించవచ్చునని మంత్రులూ మిత్రులూ సలహాలను యిచ్చారు. కాని అమానుల్లా అంగీకరించలేదు. పైగా 'నా ప్రజలతో నేను యుద్ధం చేయను. నా ప్రజలలో ఒక్కరి ప్రాణమైనా సరే నావల్లను పోకూడదు. నా సద్భావం అర్థమయ్యే జ్ఞానం కలగగలందులకు నా స్వార్థాన్ని ఎంచకుండా రాజ్యాన్ని వారికే విడిచిపెట్టి వెళ్లిపోతాను' అని సింహాసనం దిగి భార్యతోనూ తన సంతానంతోనూ పరదేశవాసి అయిపోయినాడు.

అమానుల్లా రాములను పోల్చి చూపడంలో నా ఉద్దేశం ఇది: ప్రేమించిన స్త్రీ యెడల పురుషుడు ప్రవర్తించవలసిన విధంలో ఉత్తమ విధానం చూపించి అమానుల్లా పురుషుని గౌరవాన్నీ స్త్రీ గౌరవాన్నీ నిలిపి, ప్రేమ ఉత్కృష్టతకు దృష్టాంతముగా అయినాడు. ఇటువంటి పురుషుల్ని స్త్రీలు గౌరవించగలరు.

ఇటువంటి పురుషులవల్లనే వారిని చెట్టబట్టిన స్త్రీలగౌరవం నిలుస్తుంది. అంత ఉత్తమురాలూ, సాధ్వీఅయిన సీతను, ఒక చాకలి మాటకు ప్రజల అభిప్రాయంకోసం ఇల్లు వెడలనడపినక్రూరుణ్ణి ఉత్తమ పురుషునిగానే యెంచి, ఇటువంటిభర్తల దౌర్జన్యాలకు లొంగి 'సీతవంటిభార్య'గా కావడం పతివ్రతాలక్షణమని తెల్పడంలో హిందూ సంఘంలోని స్త్రీలను అమానుషంగా, నిర్జీవంగా, భర్తదుండగాలకూ పైశాచ్యాలకూ వెన్నెముకబలం లేకుండా లొంగిపోవలసిన చచ్చులనుగా చేసివేస్తున్నాము. ఇందువల్లను హిందూసంఘములోని స్త్రీ మానుషం నీరసపడిపోయి బానిసగా తయారవుతూవుంది.

భర్త ఏఅన్యాయం చేసినా లోలోపలనే కన్నీళ్లు కుక్కుకుంటూ, భర్త యెంతఅన్యాయంగా ప్రవర్తిస్తూన్నా దిద్దనైనా అధికారం లేక, భర్త తనను నీచత్వంలోనికి దిగలాగుతూంటే లోపలను హృదయం తిరగబడుతూన్నప్పటికీ దానిని జోకొట్టి ఆ నీచతలోనికి తానూ కిక్కురుమనకుండా దిగుతూ, అతను తనజీవితాన్ని యెంత హేయ్యంగానూ దుర్భరంగానూ చేస్తూన్నప్పటికీ ఇకముందుకూడా ప్రతిజన్మలోనూ ఈభర్తే ఘట్టిగా మూడేసిముళ్లు వేస్తూఉండవలెనని నిత్యప్రార్థనలుచేస్తూ, లోపల కుళ్లిపోతూఉన్నా పైకిమాత్రం యే వ్యతిరేకభావాన్నీ వ్యక్తపరచకుండా ఉండే అద్భుత పతివ్రతాసూత్రాన్ని ఈ 'సీతవంటిభార్య'లో ఇమిడ్చివుంచి ఆదర్శంగా చూపకపోతే హిందూ సంఘంలోని స్త్రీలు ఈనాటి దుర్దశలోనికి వచ్చిఉండరు.

'రామరాజ్య' మనీ, 'సీతవంటిభార్య' అనీ వీటిని నిత్యలక్ష్యాలుగా చూపుతూ, అందువల్లను కలిగే లోపాలనూ ప్రమాదాలనూ సంఘం గుర్తించకుండా ఉండడం ఈ వ్రాతకు ఇంకొక కారణం.

8 'ఎంత సానుభూతి ఉన్నా తనను ప్రేమించిన పరపురుషునితో స్నేహంగా ప్రవర్తించడమూ, ఏఅవసలో ఉన్నప్పటికీ అతని శిరస్సు తనతొడమీద పెట్టుకోవడమూ సీతపవిత్రతకు లోపంకదా?' అన్న ఆక్షేపణను తర్కించుతాను:

పరపురుషునితో స్నేహంగా ప్రవర్తించడం పవిత్రతకు లోపమని ఎందుకు ఎంచవలెను? నీతి ధర్మం సదాచారం అనేవి అందరకూ సమానాలే. వ్యక్తులనుబట్టి వీటికి మార్పు రారాదుకదా!

అయినప్పటికీ సంఘం తాను యేర్పాటుచేసినప్రకారం వ్యక్తుల్ని నడపడానికి నీతినీ, ధర్మాన్నీకూడా అనేకవిధాలుగా నిర్ణయించింది. ఈ యేర్పాటులో స్త్రీలకు ఒకనీతీ, పురుషులకు ఒకనీతీ అయినవి. మగవారికి తప్పుకానివి అనేకం స్త్రీలపట్ల పరమదూష్యాలుగా మారినవి.

ఈసితికి రామాయణం ఎంతవరకూ తోడ్పడుతూన్నది? యుద్ధానంతరం విస్మయంతోనూ, సంతోషంతోనూ, స్నేహంతోనూ మిశ్రితమైన ముఖముద్రతో సీత ప్రథమసందర్శనానికి రాగా, మండిపడి రావణునిఅంకంవల్ల భ్రష్టవైన నిన్ను ఏ పురుషుడు అంగీకరిస్తాడు, అని నిందించి, నీయిష్టమైనట్లుగా పొమ్మన్నాడు. శల్యాలవంటి ఈమాటలకు,

ప్రవిశన్తీవ గాత్రాణి స్వాన్యేవ జనకాత్మజా
వాక్శల్యైస్తైస్సశల్యేవ భృశ మశ్రూణ్యవర్తయత్.
కిం మా మసదృశంవాక్య మీదృశం శ్రోత్రదారుణమ్
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతా మివ.

న తథాస్మి మహాబాహో యథా త్వమవగచ్ఛసి
ప్రత్యయం గచ్ఛ మే యేన చారిత్రేణైవ తే శపే.
యద్యహం గాత్రసంస్పర్శం గతాస్మి వివశా ప్రభో
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి.
మదధీనం తు యత్తన్మే హృదయం త్వయి వర్తతే
పరాధీనేషు గాత్రేషు కిం కరిష్యామ్యనీశ్వరా!
సహసంవృద్ధభావాచ్చ సంసర్గేణచ మానద
యద్యహం తే నవిజ్ఞాతా హతా తేనాస్మి శాశ్వతమ్.
ప్రేషితస్తే యదావీరో హనూమా నవలోకకః,
లఙ్కాస్థాఽహం త్వయా వీర కిం తదా న విసర్జితా ?
ప్రత్యక్షం వానరేన్ద్రస్య తద్వాక్యసమనన్తరమ్,
త్వయా సంత్యక్తయా వీర త్యక్తం స్యాజ్జీవితం మయా.
నవృథా తే శ్రమోఽయం స్యాత్సంశయేన్యస్య జీవితమ్,
సుహృజ్జనపరిక్లేశో నచాయం నిష్ఫల స్తవ.
త్వయాతు నరశార్దూల క్రోధమేవానువర్తతా
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్.
పృథక్ స్త్రీణాం ప్రచారేణ జాతిం తాం పరిశఙ్కసే
పరిత్యజేయం శఙ్కాంతు యది తేఽహం పరీక్షితా.
అపదేశేన జనకా న్నోత్పత్తి ర్వసుధాతలాత్,
మమవృత్తంచ వృత్తజ్ఞ బహుతే నపురస్కృతమ్.
అప్రీతస్య గుణై ర్భర్తు స్త్యక్తాయా జనసంసది.
యాక్షమా మే గతిర్గన్తుం ప్రవేక్ష్యే హవ్యవాహనమ్.

యుద్ధకాండ 119 సర్గ



అశోకం

తన అవయవాలలోనికి తాను 'ప్రవేశించేటట్టుగా సిగ్గుపడిపోతూ కన్నీరుకారుస్తూ అన్న జవాబు చూడండి:

'ఇటువంటి కర్ణకఠోరమైన సాటిలేని వాక్యాలను తక్కువవాడు తక్కువవారిని అన్నట్టు అంటున్నావు. నీవు నన్ను ఎటువంటిది అనుకుంటున్నావో అటువంటిదానను కాను నేను. నా చారిత్ర్యాన్ని బట్టి అయినా నన్ను నమ్ము. ఒట్టువేసుకుంటాను. ఏ కారణంవల్ల రావణుని స్పర్శ పొందానో అందులో నా కోరిక ఏమీ లేదు; కేవలం దైవమే అపరాధం పొందుతున్నాడు. శరీరము నా స్వాధీనమందున్నప్పుడు నా హృదయము నీయందే లగ్నము, అవయవాలు పరాధీనములైనప్పుడు ఏమి చేయగలను? ఇన్నాళ్ళ కాపురంలో నా శీలాన్ని నీవు గ్రహించకపోతే శాశ్వతంగా నశించాను. లంకలో ఉన్న నన్ను చూడడానికి హనుమంతుణ్ణి ఎప్పుడు పంపించావో అప్పుడే నన్ను విడిచిపెట్టకపోయావా? విడిచిపెట్టినట్టు అప్పుడే కబురుచేస్తే నా అంతం నేను చూసుకుందునే. ఎందుకు ఇందరు స్నేహితులకు ప్రయాసా, నీ ప్రాణాలకు అపాయమూ కల్పించుకున్నావు ఈ మాత్రానికి? కోపాన్నే అనుసరిస్తూ నీచపుమనుష్యునివలె స్త్రీత్వాన్నే పురస్కరించుకుంటున్నావు. -అంటే ఆడవారు అన్నంతమాత్రాన్నే అనుమానించే నీచపు మనుష్యునివలె అయినావు- స్త్రీ అన్నంతమాత్రాన స్త్రీ జాతినే శంకిస్తున్నావు...

ఆ స్త్రీత్వాన్నే పురస్కరించుకుంటున్నావు కాని నా వంశాన్నీ నాచారిత్ర్యాన్నీ ఆలోచించకపోతున్నావు. ఈ జనులముందు భర్త విడిచిన నేను నాకు యోగ్యమైన గతిఅయిన అగ్నిహోత్రాన్ని

పొందుతాను'. అనడమే చాలునని 'సరే' అన్నట్టు రాముడు లక్ష్మణునికి సౌంజ్ఞచేశాడు. లక్ష్మణుడు నిప్పు రగిల్చాడు. అగ్నిప్రవేశం ఆమె చేసి నిర్మలతేజస్సుతో అగ్నిలోనుంచి బయటకు రాగలిగింది.

ఈవిధంగా పవిత్రతను వ్యక్తపరుచుకున్న సీతను అయోధ్యచేరిన తరువాత ఈ ఆదర్శపురుషుడు ఏవిధంగా మన్నించినదీ ఇదివరకే పరిశీలించాను. చాకలినోటను అపవాదు ప్రారంభంకాగానే అగ్నిప్రవేశం 'వన్స్‌మోర్' అన్నాడు. కాని ఆత్మాభిమానమున్న సీత అంగీకరించలేదు.

అప్పుడు లక్ష్మణునితో రహస్యంగా మాట్లాడి దొంగయేర్పాటు చేశాడు. అడివికి షికారుఅని వంకపెట్టి తీసుకువెళ్ళి లక్ష్మణుడు ఆమెను విడిచిపెట్టివేశాడు. ఎందుచేతను ఈదౌర్జన్యమూ అన్యాయమూ! సీత స్త్రీ కనుక. ఏ సంశయానికి అవకాశం కలిగినా స్త్రీ తన పవిత్రతను 'అపీల్' లేని భర్త 'సుప్రీమ్‌కోర్టు' లో నిర్ధారణచేసుకుంటూ ఉండాలి. అంతేకాదు ఆ 'చీఫ్‌జస్టిస్' ప్రజలయెదర నీ పవిత్రతను రుజువుచేసుకుంటేనే గాని నిన్ను తిరిగి అంగీకరించడము వీలు కాదు. అని 'జడ్జిమెంట్' చెబితే ఆమె ఏవిధంగానో ప్రజల సద్భావాన్ని తిరిగి సంపాదించుకోవాలి. ప్రజాభిప్రాయానికి భార్యాభర్తల కాపురానికీ సంబంధం ఏమిటి! అంటే సంఘంలో స్త్రీ ఒకవ్యక్తి కాదు. అందుచేత ఆమెఖ్యాతీ ఆమెఅపఖ్యాతీ ఆమెవు కావు. 'ఫలానివాడి భార్య' అనేకదా ఆమెపరువంతా. అందుచేత ఫలానివాడిభార్య ఇటువంటిది అనే అపఖ్యాతి ఆ భర్తకు రాకుండా ఉండాలి. చాకలి



ర

అయినా చకకగా ఒకమాటు అనడానికి వీలుకానంత జాగ్రత్తగా స్త్రీమాత్రం ఉండాలి. స్త్రీలకు రామాయణం కల్పించిన వింతస్థితి ఇది.

న్యాయాన్ని నిష్పాక్షికంగా ఎంచవలెనంటే నీతిఅనేది అందరకూ సమానమవుతుంది గదా! ఇదంతా పురుషులకూ సమానంగా వర్తిసుంది అనిమాత్రం అంగీకరిస్తే, నేనొక ప్రశ్న వేస్తాను: రాముణ్ణి శూర్పణఖ ప్రేమించింది. అతన్ని పొందడానికి అనేకయత్నాలు చేసింది. ఇది ఒకటి. రెండు, సీతాపహరణం అయిన తరవాత రాముడు విరహంలో గడిపాడు జీవితం. ఇటువంటిస్థితిలో ఉన్నవాడు అనవసరంగా అన్నదమ్ములపోట్లాటలో కలిగించుకుని అన్యాయంగా వాలిని చంపి తారను సుగ్రీవుడికి దానంచేశాడు. రెండుచేతులు మారడానికి ఏ అభ్యంతరమూ పెట్టని ఆమెవిషయంలో అనవసరంగా కలిగించుకున్నాడుగదా! ఈ రెండువృత్తాంతాలలోనూ, అతడు పవిత్రంగానే ఉన్నాడు అని నమ్మకం నిర్ధారణకోసం రాముడుకూడా అగ్నిప్రవేశం ఒక్కసారి చేయకూడదా? అంటే, రాముడు మగవాడు, మగవాడిపవిత్రత చెడడం ఏమిటి? అనే అతిన్యాయమైన జవాబు వొస్తుంది.

ఈ విధంగా నీతిని పురుషులకు ఒకటి, స్త్రీలకు ఇంకొకటి అని రెండువిధాలుగా విభజించడంలో తయారైన ప్రమాణగ్రంథాలను బట్టి హిందూస్త్రీ అన్యాయస్థితిలో పడిపోయింది. ఈ అద్భుతగ్రంథాలు స్త్రీని ఈవిధంగా దిగదీయడానికి కల్పించిన కల్పన ఎటువంటిది? స్త్రీ, హృదయం ఆత్మ లేని శరీరం. అందుచేతనే 'ఆమె' భార్య అనగా భరింపబడేది ఔతుంది. మగవాడు మీసంమీద చేయివేసి, భర్త అనగా భరించేవాడు ఔతాడు:-ఆమెఆదాయాన్ని భోంచేస్తూ బ్రతుకుతూన్నా

సరే. కేవలం శబ్దంచేతకూడా భరించేవాడు కాబోతున్నాడు గనుక ఆమె నీతినీ, ఆమె ధర్మాన్నీ, ఆమె ప్రవర్తననీ తనజీవితానికీ, తన ఖ్యాతికీ, తనసుఖానికీ సరిపోయేటట్టుగా తాను నిర్ణయిస్తాడు. హృదయం, ఆత్మా లేనిదికనుక, తన ప్రశంస తనకు కారానివస్తువుగా మారుతుంది భార్య. వస్తువు తననీతిని తాను నిర్ణయించలేదుకదా! అందుచేత వస్తువులకు సంబంధించిన నీతిని అనుభవించేవారు నిర్ణయిస్తారు. కేవలం వస్తువువంటిది అయినది కనుక, స్త్రీ, తననీతిని తాను నిర్ణయించుకోలేదు. తమనీతిని తాము నిర్ణయించుకోలేనివారికి స్వేచ్ఛ పనికిరాదు. పరపురుషుడితో స్నేహంగా ఉండగలిగే స్వేచ్ఛ, నీతిబాహ్యమౌతుందిగదా స్త్రీకి.

తననడవడిని నీతికి దిద్దగలిగిన శక్తి స్త్రీకికూడా ఉన్నది. ఆమెకూ ఆత్మా హృదయము ఉన్నవి అని అంగీకరిస్తే ఒక చిక్కు వున్నది. ఆత్మను అంగీకరిస్తే వ్యక్తిత్వం కలుగుతుంది. వ్యక్తిత్వం ఉంటే కర్మాధికారం కలుగుతుంది. కర్మాధికారం ఉంటే తనచేష్టలకు తాను తనకే బాధ్యురాలవుతుంది. తనకు తానే బాధ్యత కలిగి ఉండడమే స్వాతంత్ర్యం. ఈరహస్యాన్ని గ్రహించిన జాగ్రత్తగల హిందూధర్మాత్ములు 'స్త్రీకి ఆత్మలేదు.' అనే ఒక్క చిన్న సూత్రంతో ఆమెసమస్తాన్ని సరిపెట్టివేశారు.

ఈ కావ్యంలోని సీత తనధర్మాన్ని తననీతిని అడుగడుగునా తానే నిర్ణయించుకుని శీలం నిలబెట్టుకోగల వ్యక్తిత్వమున్న స్త్రీ అయింది. అందుచేతనే పరపురుషుడితో స్నేహంగా ప్రవర్తించగలిగింది. రాముడు అన్యాయంగా ఆతనికీర్తికోసం పెట్టినబాధలూ అవమానాలూ సహించి, భర్తదుండగాలకు చచ్చుగా లొంగినట్టూ, ఆ విధంగా

లొంగడమే పాతివ్రత్య మన్నట్టూ ఎంచనంతమాత్రాన ఈ అశోకం లోని సీత ఉత్తమస్త్రీ కాకపోవడంలేదు.

ఇంతకూ అసలు వాల్మీకిరామాయణంలోని సీత రాముడి అన్యాయ ప్రవర్తనలకు ఎంతమానుషంగా అతనే సిగ్గుపడేటట్టుగా ప్రవర్తించి నదో ఇదివరకు తర్కించినభాగాలుకాక, సీత నిర్యాణాన్ని గురించి తర్కించుకుంటే బోధపడుతుంది. ఆమె నిర్యాణం అఖర్ని నిజమైన రామాయణకథలో విశదంచేస్తాను.

ఇక, 'రావణునితల తొడమీదను పెట్టుకోవడంవల్ల సీతపవిత్రత చెడిపోలేదా ?' అన్న సందేహాన్ని తర్కించుతాను: రావణుడు తనను ప్రేమించి బాధపడి తనకోసం నాశనంకాను సిద్ధపడినవాడు. ఆస్థితిలో పాదాలకడ మూర్ఛపడిపోయాడు. అటువంటి అవస్థలో అతన్ని ఆదరించడం తప్పుకాదు సరేగదా,ఆదరించకపోవడం లోపంగా కూడా గణన కావలసివుంటుంది.

సాంఘికనియమాలకు మానసికబానిస లయిపోయిన దురదృష్ట వంతులకు కూడా కష్టానికి ఆదుకునే అద్భుత స్వాభావికం. ఒక అస్పృశ్యుడనుకునేవాడు ప్రాణాపాయస్థితిలో ఉన్నాడు అనుకుందాము; చూస్తూఉన్న సనాతన బ్రాహ్మడి హృదయమూ సహజంగా సహాయానికే ఈడుస్తుంది మొదట. కాని, ఉత్తమమానవత్వాన్ని దహనం చేసి దౌర్భాగ్యపు స్వార్థానికి ఊత అయిన బ్రాహ్మణకూహ వెంటనే వెనుకకు లాగివేస్తుంది. సహజమానవత్వాన్ని దిగలాగే స్వార్థపు రెండవ ఊహాలలో అధికుణ్ణి అనుకుని భ్రమపడేవాడేకాని వైవిధ్యంగా సనాతనబ్రాహ్మడు కాలేదు. సహజమైన మానవత్వాన్ని ఖూనీచేసే ఈ

స్థితి న్యాయసూత్రాలు గ్రహించవలసిందేకదా! మానవసహజమైన ఆదరాన్ని పాడుచేసుకున్న అటువంటి హృదయమే ఆర్ద్రతను పొందుతుంది అని అంగీకరించినప్పుడు, ఉత్తమమానవత్వాన్ని నీరుకాక్షీరంగానే కాపాడుకున్న హృదయం ఆలోచన లేకుండా సహాయానికి దూకుతుంది. అందులోనూ స్త్రీ తెగబడి ఆదరణకు పూనుకుంటుంది. దీనిని గ్రహించగలిగినవారికి సీతప్రవర్తన ప్రశ్నార్హం కాదు గదా, ప్రశంసనీయం కూడా ఔతుంది.

ఈస్థితిని అంగీకరించినప్పటికీ 'పరపురుషుణ్ణి స్పర్శించవచ్చునా?' అనే ప్రశ్న ఉద్భవిస్తుంది. దీనికి జవాబు చెబుతాను: ప్రాచ్యజాతులను [ఈనాటి జపానుతప్ప ఇతరజాతులను] ఒకవిధమైన దుస్థితికి తెచ్చింది స్పర్శభయం. ఏవిధంగా నంటే, ప్రతిపురుషుడిస్పర్శా ఒక్క ఉద్రేకాన్నే కలిగిస్తూఉన్నది అనే అర్థం కనిపిస్తూంది స్పర్శకు స్త్రీలు భయపడేటట్టుచేయడం. తగిన శీలమూ, నిగ్రహమూ, కలిగినభర్త సహితం ఒక్క సమయంలో తప్ప ఇంకెప్పుడూ అదృష్టిగా కనబడకుండా ఉంటే కలిగే ఆరోగ్యానికి భిన్నంగదా ఈస్పర్శకు ఇంత ప్రాముఖ్యత కల్పించడం. దీనివల్ల ప్రాచ్యసంఘాలలో కలిగినమార్పు చూడండి! ఎదిగినకుమారుణ్ణి తల్లిగాని, ఎదిగిన చెల్లెలిని అన్నగాని స్పర్శించడానికీ కౌగిలించుకోడానికీ సాహసించలేకున్నారు. అంటే, మితిమీరజేసిన ఈస్పర్శ సహజమైన మాతృత్వాన్నీ భ్రాతృత్వాన్నీ ఒక దుర్భరమైన రూపానికి మార్చివేస్తూఉన్నది అన్నమాట. ఇది ఎంతసిగ్గుపడవలసిన విషయం! తాను ప్రేమించినవారు ఒకకోర్కెతో తనను స్పృశించినప్పుడు తప్ప ఏ యితరస్పర్శకూ శరీరం స్పందించకుండా చేయగలిగినప్పుడు మన నైతికజీవితాన్ని ఎంత వృద్ధిపరచినవార మవుతాము!

ఇది అంగీకారమైనా సాధ్యమా? అనిపించుతుంది. ఎందుకు సాధ్యంకాదు? ఏది దుస్సాధ్యం చేస్తామో దానికై మోహపడడం మానవ స్వభావం. ఇందుకు తార్కాణలు చూపుతాను.

1 తెల్లవారిలో ఒక వింతప్రకృతి ఉండేది: కాళ్లు ఏభాగమూ కనబడకుండా మేజోళ్లు తొడుగుకోవడం వారిలో స్త్రీలకూ పురుషులకూ అభ్యాసం. నిరంతరమూ పాటించడంవల్ల ఈఅభ్యాసం మర్యాదగా మారింది. చివరకు ఏస్థితి వచ్చిందంటే: మేజోళ్లు లేకుండా నగ్నంగా మడమశీలలు కనిపిస్తే వారికి రతిఉద్రేకం కలిగేది. మడమశీలలుకూ ఈ ఉద్రేకానికీ ఏమిసంబంధం అని బుద్ధిమంతులు ఆలోచిస్తే సంఘ నియమాలవల్ల మానవప్రకృతిని ఎంత నీచతకు దింపగలమో విశదమౌతుంది.

2 మళయాలదేశంలోని స్త్రీలు రవికలు తొడగడం పట్టింపు కాదు. వారివక్షాలు నగ్నంగానే ఉంటవి. ఆ దృశ్యం అక్కడి పురుషులకు వికృతం కావడంలేదు.

3 దృష్టివంటిదే స్పర్శకూడా. పాశ్చాత్యులు, స్త్రీలూ పురుషులూ స్పర్శకు ఏవిధంగానూ ప్రాముఖ్యతను కల్పించుకోలేదు. స్త్రీలు ఏ వికారాన్నీ పొందకుండా ఏపురుషులతోనైనా కలిసికూర్చుంటూరు, ప్రయాణాలు చేస్తారు. వారిని ముట్టుకుంటూరు, ఈ దేశస్త్రీలు వాడిలి పోవలసిందేగదా అంతటి ధైర్యసాహసాలకు.

మనస్త్రీలను పరపురుషుడిస్పర్శ మనస్సునీ నీతినీ ఇంత కలవరపెట్టేటట్టు చేయడంవల్ల సాంఘికంగా స్త్రీ స్థితి అన్యాయమైపోయింది. స్త్రీ పురుష బాంధవ్యంలో పంచేంద్రియాలూ ఒక్క ఉద్రేకానికే

కారణభూతంగా భావించడంవల్లనూ, స్పర్శకు ఇన్నివిధాల లొంగి పోవడంవల్లనూ స్త్రీల స్వాతంత్ర్యాలు కట్టుబడిపోయినై.

స్పర్శా మానసికవికారమూ సన్నిహితం. ప్రతిస్పర్శా మానసిక వికారాన్ని కల్పించినప్పుడు ఆ వ్యక్తినీతి కళ్మలమవుతుంది. మానసిక వికారం కలిగినప్పుడు స్పర్శసుఖం అనుభవవేద్యంకాకడం ఉత్తమమవు తుంది. అంటే స్పర్శకు మానసికవికారాన్ని లొంగదీసినవారు ఏహ్య మౌతారు. మానసికవికారానికి స్పర్శను లొంగదీయగలిగినవారు నైతి కంగా ఉత్తమస్థితిని పొందినవారు ఔతారు.

స్త్రీ, కేవలం శరీరమే కాదు. ఆమెకూ హృదయం ఉన్నది. ఆత్మ ఉన్నది. శరీరానికి సంబంధించినది స్పర్శ. హృదయానికి సంబంధించి నది కామం. ఆత్మకు సంబంధించినది ఆధ్యాత్మికజిజ్ఞాస. స్పర్శకు కామాన్నీ, కామానికి ఆధ్యాత్మికతనూ లొంగదీసిన వ్యక్తిగాని, జాతి గాని నైతికంగా అధమస్థితిలో ఉన్నట్టు ఎంచక తప్పదు

రోగకారణంకానిస్పర్శ శరీరపవిత్రతను బాధించలేదు. మానసిక వికారాన్ని కల్పించని స్పర్శను శరీరం పాటించనక్కరలేదు. అప్పుడు మానసికపవిత్రతకు బాధలేదు. స్త్రీ కేవలం శరీరమే కాకుండానూ ప్రతిస్పర్శకూ ఆమెమనస్సు కలవరపడే అసహ్యస్థితిలో ఆమె లేకుం డాను ఉంటే, స్పర్శవల్లను ఆమె పవిత్రత ఏవిధంగానూ భగ్నం కాదు. ఇది సత్యమైతే ఆమె పరపురుషుల స్పర్శకు భయపడి సంచ రించవలసిన అగత్యం లేదు. ఈకారణాలను గ్రహించి ఈఅశోకం లోని సీతను అర్థంచేసికోగలిగితే ఆమెప్రవర్తన ఉత్తమంగానే కని పిస్తుంది.

ఈ కావ్యాన్ని గురించి నాలుగుమాటలు: స్వయంవరమూ, ఆ ముందు రామరావణులు సీతను కలుసుకోవడమూ; రావణుడు సీతారాములను లంకకు ఆహ్వానించడమూ; శబరికథ కొంచెం ముందుగా రప్పించడమూ వాల్మీకి కావ్యంలో లేనివి. ఈ కల్పనలవల్ల కావ్యపోషణకు ఎక్కువ ప్రయోజనం కలిగిందని అనిపిస్తే అదే సమర్థిస్తుంది ఆ మార్పులను. ఇంతకన్నా ముఖ్యం, రామాయణాలకు విరుద్ధంగా రావణుణ్ణి సానుభూతితో చిత్రించడం. ఇందుకు కారణాలు ఇదివరకే తెలియజేశాను. రామాయణకర్తలవలె రావణుణ్ణి సమర్థించడంలో నేను రామునికిగాని, సీతకుగాని, ఏ లోపాలూ సృష్టించలేదు. పైగా ఈ కావ్యంలోని సీతారాములను రామాయణాలలోకన్నా ఉత్తములనుగా, ఎక్కువ గంభీరులుగా, ఉదార స్వభావులుగా, మానవ పరిణామంలో ఉత్తమస్థాయిని పొంది సత్యం నిండు తేజస్సును గ్రహించిన పవిత్రాత్ములనుగా నిర్మించడానికి యత్నించాను.

జీససును గురించి మీ అభిప్రాయం ఏమిటిఅని గాంధీజీని అడిగితే, ఈ విధంగా జవాబునిచ్చాడు: 'జీససులో చాలా ఉత్కృష్టమైన ఆశయాలు గోచరిస్తవి. వాటిని లక్ష్యాలుగా ఎంచుకోవడం మానవజాతికి ఉత్తమం. జీససునుగురించి నా అభిప్రాయం ఇంతే. జీససు అనే వ్యక్తి ఒకప్పుడు ఉన్నాడా లేడా, అతన్నిగురించి వ్రాసినవ్రాతలు నిజములా, అన్నవిషయాలతో నాకు ఏమాత్రమూ నిమిత్తంలేదు. రేపు ఏ పరిశోధనవల్లనైనా బైబిలులోని జీససు కేవలం కల్పన అని తేలినప్పటికీ జీససుకు నేను ఇంతవిలువనూ ఇస్తాను' అన్నాడు. క్రైస్తవులకు జీససువలె హిందువులకు రాముడు. రాముడు కేవలం చరిత్ర పఠించేవారికే సంబంధించినవాడు కాదు. హిందూసంఘజీవితమంతా

అల్లుకున్నవాడు. అంటే హిందూ సంఘం అనేక విషయాలలో లక్ష్యంగా చూసుకుంటూంది ఈ చరిత్రను. అందుచేత రామాయణం మొదలు నేటివరకూ మానవమానసికవికాసం పొందిన పరిణామం దృష్టిలో సీతారామరావణుల పరిస్థితులలో చిక్కుబడినవారు ఏవిధంగా ప్రవర్తించడం ఉత్తమమో, రామరావణులవలె రెండు భిన్న ఆశయాలకు వైరుధ్యం కలిగినప్పుడు వ్యక్తులు ఏవిధంగా ప్రవర్తించడం న్యాయమౌతుందో ఆ విధానాన్ని అవగాహనకై యత్నించాను. గాంధీజీ చెప్పినట్లు ఉత్తమఆశయాలుగా ఎంచదగిన జీవితాలు కేవలం చరిత్రాత్మకాలే కావు గదా! వాటికి నూతన అర్థకల్పనచేయడం నిత్య నూతనత్వాన్ని వాటికి ఆపాదించడమే గదా!

విరోధినైనా సానుభూతితో గ్రహించేటట్లుగా మానవహృదయంలోని దాక్షిణ్యాది మహత్తరగుణాలను వినియోగపరిచేటట్లు చేయడము, ఉత్తమమానవత్వానికి సరియైనదారిని చూపడంకదా!

## అసలుకథ

వాల్మీకిరామాయణంలోని కొన్నిఘట్టాలను బట్టి ఊహిస్తే అసలు కథ ఈ విధంగా గోచరిస్తుంది: దశరథుడు స్త్రీలోలుడు. ఆయనకు 365 గురు భార్యలు. కైక ఈ దేశస్త్రీ కాదు. ఆమె బాహ్లీక దేశంలోని గిరివ్రజపురంరాజు కుమార్తె. ఇప్పుడు బెలూచ్ ఆఫ్ఘనిస్థానాలలో చేరినది ఆ రాజ్యం. కైక అనే పేరుకూడా 'కైకొస్రో' 'కైకోబాద్' అనే పేరులకు దగ్గరగా కనబడుతుంది. కైక పరాయి కనుక నేమో దశరథునికి వలపుభార్య అయింది. రాముణ్ణి పట్టభద్రుణ్ణి చేయబోతే కైక ఏ విధంగానూ మారాడలేదు. కాని మందర ప్రేరేపించింది. మందర

కైకతో అరణంవచ్చిన దాసి. ఆమె ఈ విధంగా ఉపదేశించేసి వుంటుంది: 'ఈ దేశానికి మనం ఏనాటికీ పరాయివాళ్ళమే. నీవు దశరథునికి వలపుభార్యవైనా రాముడు రాజయితే క్రమేణా కౌసల్యఅధికారి అవుతుంది. ఇకముందు నిన్నూ నీ సంతతిని ఈ దేశస్థులు తృణీకరించకమానరు. అందుచేత ఏవిధంగానైనా రాముణ్ణి తప్పించి భరతునికి రాజ్యం వచ్చేటట్టు యత్నించు. ఈవిధంగా నీవు చేయకపోతే,

హృష్టాఃఖలు భవిష్యన్తి రామస్య పరమాః స్త్రియః
అప్రహృష్టా భవిష్యన్తి స్నుషా స్తే భరతక్షయే.

'రాముని ప్రియులైన స్త్రీలు సంతోషిస్తూఉండగా, భరతుని భార్యలైన నీ కోడళ్లు సంతోషం లేకుండా ఉండవలసి వొస్తుంది' అని.

మందరతర్కం కైకేయిమనస్సుకు మార్పుతెచ్చింది. కైకపట్టు నెగ్గింది. దశరథుడు రాముణ్ణి ఎంత ప్రేమించినా ముద్దులభార్యకు లొంగిపోయాడు. ఇందువల్ల రాముడు రాజ్యభ్రష్టుడైనాడు. ఈవార్త గిరివ్రజపురంలో తాతగారియింటనున్న భరతునికి తెలియగానే వచ్చాడు. కాని తల్లిఅభిప్రాయాలతో అంగీకరించలేదు. భరతునిప్రార్థన రాముడూ వినలేదు. అందుచేతను అరణ్యవాసం సాగింది. రాముడు అనార్యులను జయిస్తూ ఆర్యదిగ్విజయం ప్రారంభించాడు. రావణునిసంగతి విని అతన్ని జయించవలెననే ఆశ రామునికి కలిగి ఉండవచ్చును. లేకపోతే ఏచిత్రకూటంలోనో సుఖంగాఉండక దక్షిణప్రయాణం పెట్టుకోవలసిన అవసరమూ, అనవసరంగా రాక్షసతెగలవారి నందరిని వీలున్నంతవరకూ ఆర్యమునుల అర్జీలప్రకారం చంపవలసిన అగత్యమూ కనిపించదు.

లంకాపట్టణం రాజధానిగా రావణుడు దక్షిణదేశాలను పాలిస్తున్నాడు. అతడు మహాబలవంతుడు. అతని రెండుభుజాలు పదిభుజాలతో సమం. అతని ఒక్క మెడ పది మెడలతో సమం. ఇదికాక అతని తెగ వారు శాస్త్రసాధనతో అనేక యంత్రాలూ విమానాలూ నిర్మించుకుని మహాబలవంతులై అనుభవిస్తున్నారు.

తనవారిని రాముడు అన్యాయంగా బాధిస్తున్నాడన్న సంగతి విని కూడా రావణుడు కలుగజేసికోలేదు. కాని సీత సౌందర్యానికి చకితుడైనాడు. ఆమెను అపహరించాడు. అతిమర్యాదగా ఆమెను గౌరవిస్తూ శరీరవాంఛతో తృప్తిచాలదు నాధర్మపత్నివి కమ్మని ప్రతిమాలుకున్నాడు. ఒకవత్సరం గడువు ఇవ్వు, అన్నది ఆమె. అందుకు అంగీకరించాడు.

ఈలోపున రాముడు వాలిని అధర్మంగా చంపి తారనూ రాజ్యాన్నీ సుగ్రీవుడికి ఇచ్చి ఆవిధంగా వానరసహాయ్యాని కూర్చుకుని లంకప్రవేశించాడు. యుద్ధం సిద్ధమైనప్పుడు రావణుడు తనవారి సలహాను అడిగాడు. 'సీతను రామునికి ఇప్పుడు ఇచ్చివేయడము భయపడి లొంగడమనిపించుకుంటుంది. ఆవిధానం పనికిరాదు' అని పౌరుషాన్ని పురికొల్పాడు కుంభకర్ణుడు.

విభీషణుడు రావణుని చిన్నతమ్ముడు. లోపలలోపల గోతులు తవ్వే తంత్రగొట్టు. ధర్మాన్ని పురస్కరించుకొన్నట్టు, 'సీతను క్షమాపణపూర్వకంగా అర్పించకపోతే రాముడు సర్వనాశనంచేస్తాడు' అని బెదిరించాడు. 'ఇంత పిరికిగా శత్రుపక్షం పలుకుతావా?' అని రావణుడు అంటే, 'రాముడి బాణాలు నీ శరీరాన్ని బాధిస్తూ ఉండగా చూడలేనుకనుక ఈవిధంగా నీ క్షేమాన్ని ఎంచి చెప్తూన్నాను. పోనీ

నీకు ఇష్టంలేకపోతే. నీకే జయమూ శుభమూ చేకూరుగాక అని కోరుతూ నేను ఎక్కడికైనా పోతాను. వ్యతిరేకంగా పలికే నేను లేకుండా నీవు సుఖంగా ఉండు, అని అన్నమీదట మహాప్రేమా అభిమానమూ ఉన్నట్టు మాట్లాడి, ఎక్కడికో పోయేటట్టు వంక కల్పించుకుని లంకాపట్టణాన్ని దాటి తిన్నగా రామునిదగ్గరకు చేరుకున్నాడు ఈ ద్రోహి. 'రావణుణ్ణి జయించేమార్గమూ, లంకాపట్టణరహస్యాలూ, నీకు చెబుతాను, నన్ను అనుగ్రహించి నీపక్షంలో చేర్చుకో' మ్మని రాముణ్ణి ఆశ్రయించాడు. ఇదికూడా రాక్షసతంత్రం, వీడు మనరహస్యాలు గ్రహించి రావణునికి తెలియజేస్తాడు అంగీకరించవద్దని సుగ్రీవాదులు అభ్యంతరపెట్టినా దూరదృష్టిగలరాముడు అతన్ని చేరదీశాడు. పైగా అతడు తన శానిస కాగలందులకున్నూ తనకు అన్ని రహస్యాలూ చెప్పివేయగలందులకున్నూ ఆతనికి ఒక అన్యాయమైన వాగ్దానంచేశాడు: 'రావణుణ్ణి కుటుంబనాశనంజేసి నిన్ను లంకకు రాజును చేస్తాను' అని. ఇందునిమిత్తమే భ్రాతృద్రోహానికి పూనుకున్నాడు కనుక విభీషణుడు రావణుణ్ణి వధించే సూత్రాలన్నీ రామునికి తెలియజేసి సహాయపడ్డాడు. ఈ తంత్రాలవల్లను రాముడు రావణుణ్ణి చంపి జయించాడు.

సీతపైన అనుమానం కలిగి ఆమెను దూషించి పొమ్మన్నాడు. పౌరుషవంతురాలైన సీత ఈ బెదరింపునకు లొంగక నిశితంగా సబబుగా జవాబుచెప్పి తనపవిత్రతను ప్రకటించుకుంది. ఆమెను అంగీకరించక తప్పిందికాదు రామునికి. దిగ్విజయంచేసివచ్చిన సీజరును రోమకులవలె అయోధ్యకు రాగానే రాముణ్ణి ప్రజలు సంతోషంతో ఆహ్వానించారు. భరతుడు రాజ్యాన్ని అప్పగించాడు. అంతా సుఖప్రదంగాఉన్నది.

కాని ఇంతతో ముగియలేదు; రాముని ప్రతాపపు కథా, సీత అన్యాయపు బాధలూ. సీత గర్భవతి అన్న సంగతి తెలిసింది. ప్రజలలో అపవాదులు బయలుదేరినవి. కారణం: వివాహకాలం నాటికి సీత వయస్సు 8 అని, 12 అని, 18 అని, అభిప్రాయాలు ఉన్నవి. 8 అని అంగీకరించేచూ కాము. వివాహానంతరం తొమ్మిది సంవత్సరాలు అయోధ్యలో కాపురం, తరువాత పదమూడేళ్లు వనవాసం, లంకలో ఒక సంవత్సరం. ఇంతకాలంలో ఒక్కసారి కూడా కలగని గర్భోత్పత్తి కొత్త అపవాదులకు కారణమై ఉంటుంది. కేవలం కీర్తినే అపేక్షిస్తూ తన యెడల ఏ అన్యాయానికైనా వెరవని రాముడు, ఈ పరిస్థితులలో ఏవిధంగా ప్రవర్తిస్తాడో సీత గ్రహించి 'కొంతకాలం మునుల ఆశ్రమాలలో ఉంటాను' అని కోరుకున్నది. రాముడు అంగీకరించక, ప్రజల యెదుర మళ్లీ అగ్నిప్రవేశం చేసి పవిత్రత ప్రకటించుకొమ్మన్నాడు. అపవాదులకు అవకాశం నిజంగా ఉన్నప్పుడు అగ్నిప్రవేశం తానే కోరి చేసింది; కాని ఈనాటి భర్తృప్రవర్తన నీచంగానూ అమానుషంగానూ తోచింది. అందుచేతను అంగీకరించలేదు. ఆమె యెదుర ఏమీ చెప్పక రహస్యంగా లక్ష్మణునిద్వారా ఆమెను అడవులపాలు చేశాడు.

ఒంటిగా అడవులలో అల్లాడుతూ ఉన్న సీతను వాల్మీకి ఆదరించాడు. వాల్మీకి జనకుని మిత్రుడు. సీతద్వారా కథనంతా విని, ఆమెకు న్యాయం జరిగేవిధానం ఆలోచించి, రాముణ్ణి కీర్తిస్తూ సీత పడిన పాట్లను జ్ఞప్తికి తెస్తూ రామకథను వ్రాసి, లవకుశులకు ఆకథను నేర్పి వారితో రాముణ్ణి దర్శించి, కుమారులతో తానూ కథలో అభినయించి ప్రేక్షకులను సీతపరంగా అభిమానులనుగా చేశాడు. వాల్మీకి రామాయణ

రచనకు ఇదే కారణ మనడానికి ఒక ప్రబలమైన ఆధారం కనిపిస్తుంది. వాల్మీకి మహాకవి. ఆయన కళానిర్మాణ అద్భుతమైంది. తనలక్ష్యాల ప్రకారం లోపమున్నది అనడానికివీలులేని భార్యను, భ్రాతను, భృత్యుణ్ణి మిత్రుణ్ణి సీతాలక్ష్మణహనుమద్విభీషణులలో నిర్మించిన వాల్మీకి, రాముని ప్రవర్తనలో ఇదివరలో నేను విమర్శించిన పెద్దలోపాలను, లోపాలుగానే ఎందుకు ఉంచివేయవలెను ? అనే ప్రశ్నకు ఒక్కటే జవాబు కనిపిస్తుంది. రాముడు సీతయెడల తన కాఠిన్యాన్ని అవగాహన చేసుకుని ఆమెను తిరిగి అంగీకరించాలి, ఆహ్వానించాలి. ఇది తనరచనకు ప్రధానోద్దేశం, పర్యవసానం. రాముని ప్రవర్తనలోని లోపాలను లుప్తంచేయడంవల్లను ఆయన యోచించిన ప్రయోజనం చెడిపోతుంది. అనుకున్నట్లు రాముడు పశ్చాత్తాపపడి సీతను ఆహ్వానించాడు. ఈ స్వార్థపరుడైన భర్తతోనూ, ఏఅపవాదుదుర్వాసన ముక్కునకు తగిలినా సంతోషంగా తోకను ఆడించి దానికి తాలుక తగిలించే ప్రజలతోనూ ప్రాణంవిసిగిపోయిన ఆ అభిమానవతి, తన పిల్లలభవిష్యత్తు అనుకూలం కావడానికీ, రాముడు తన అన్యాయాన్ని తాను అవగాహన చేసికోడానికీ మాత్రమే ఇంతవరకూ జీవితం ఓపికపట్టి ఉన్నది. అందుచేత సభకు రప్పించగానే అతని కళ్ళయెదరనే జీవితాన్ని అంతంచేసుకుంది.

సీతను రాముడు స్వీకరించేందుకు ఉద్దేశించి వ్రాసినప్పటికీ, వర్ణనలలో అద్భుతమైన కవిత్వపుపోకడలతోనూ, తమ ఆర్యపక్షాన్ని సమర్థించడంలో ధర్మసూత్రాలను ప్రవేశపెట్టడంలోనూ రామాయణానికి మహావిలువను కలిగించాడు వాల్మీకి.

వాల్మీకి సృష్టించిన సీతారాములను చాలామంది ఎరగరు. ఆర్య ప్రచారంవల్ల ఈ కథకు సంఘంమీద పలుకుబడి పెరుగుతూఉండడం గ్రహించి బౌద్ధులు తమ సూత్రాలకు అనుకూలంగా ఈ కథనే 'దశరథ జాతకం' అని వ్రాశారు. ఆ కథలో సీత రాముని చెల్లెలు అన్నారు. వాల్మీకి రాముణ్ణి మానవుణ్ణిగానే వర్ణిస్తే, ఎవరో మహానుభావులు 200 బి. సి. తరవాతను వాల్మీకి కృతిని దిద్ది అపూర్వకల్పనలు దానిలో చొప్పించారు. ఇది కృష్ణుడితోపాటు రాముణ్ణీ అవతారంచేయడానికి, భారతంలోని 'రామోపాఖ్యానం' తరవాత జరిగినపని. ఈ పని పూర్తిచేశారు తరువాత పురాణాలను సృష్టించినవారు. ఈ తరువాత రామాయణం అనేకరూపాలు పొంది వాల్మీకికూర్చిన 8,000 అనుష్టుప్పులు 25,000 గా పెరిగింది. అటుపిమ్మట బౌద్ధులపద్ధతిని అనుసరించి వైష్ణవులు రామాయణానికి పంగనామాలు పెట్టి తమ మతానికి 'పేటెంటు' Patent చేయించుకున్నారు. రాముడిచరిత్రను తెనుగులో వ్రాసినవారెవ్వరూ వాల్మీకిని సరిగ్గా అనుసరించలేదు.

రా మా య ణ క థ:

1 ఆదికావ్యం
వాల్మీకికృతం- 8,000 అనుష్టుప్‌లు- వైద్య సంపాదితం

2 దశరథజాతకం
[బౌద్ధులది]

3 రామోపాఖ్యానం
[భారతంలోనిది]

4 పురాణాలలోని రామకథ
[పద్మపురాణం మొదలైనవి]

5 అధ్యాత్మరామాయణం

6 కాళిదాసునాటికో, ఆ తరువాతనో ఇంచుమించుగా
25,000 వరకూ పెరిగిన గ్రంథం

రా మా య ణ వి మ ర్శ కు లు:

వైద్య
వీబర్
మ్యూర్
వీలర్
హాప్కిన్స్



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 102B147 |
| పుస్తకం పేరు | G8 30 |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 133 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,6,CI,BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | nandini |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |